# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక


## సంపాదకవర్గం

సంపాదకుడు

లయన్ కె.వి.గోవిందరావు

గౌరవ సహాయ సంపాదకులు:

టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్.సి

వి.బాలకుమార్

సభ్యులు:

కె.వి.ఎస్.గోవిందరావు

కె.వి.ఎస్.శరత్ బాబు

కె.వి.ఎస్.విజయకుమార్

కె.రత్నకుమారి

## చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (సంవత్సరానికి) | 80.00 |
| సీ మెయిల్ (సంవత్సరానికి) | 45.00 |

చందా పంపవలసిన చిరునామా:

విస్డమ్

9, దేశికా రోడ్డు, మైలాపూర్,

మద్రాసు-600004


# ఈ సంచికలో

జనవరి 1986





ముఖచిత్రం

సంక్రాంతి సూర్యునికి నైవేద్యం

**తెలుగు విస్డమ్‌కు ఇది ఐదవ సంవత్సరం**

# విస్డమ్

## అవార్డుల సభ

1985 డిసెంబరు, 20 వ తేదీ

సాయంత్రం గం. 6-00 లకు

న్యూ వుడ్‌లాండ్స్ హోటల్

(డా. రాధాకృష్ణన్ రోడ్, మద్రాసు-600 004)

అధ్యక్షులు :

**శ్రీ ఎస్. ఎల్. ఖురానా**

తమిళనాడు గవర్నర్

తెలుగు ప్రత్యేక సంచిక ఆవిష్కర్త :

**శ్రీ సి. ఆర్. పట్టాభిరామన్**

మాజీ కేంద్రమంత్రి

(సలహా సంఘ సభ్యులచే విజేతలకు

'విస్డమ్' అవార్డుల వితరణ)

## ధ్యానం

### విజయవంతమైన జీవితానికి నాలుగు ముఖ్య ధర్మాలు



జేమ్స్ ఎలెన్

ఒక వ్యక్తి తన జీవితాన్ని దిగ్విజయంగా, దార్ఢ్యంగా, సర్వోత్కృష్టమైనదిగా మార్చుకోవాలంటే జీవితంలో సంభవించే అసంభవాలను, కష్టతరమైన సమస్యలను మమకార వర్జితుడై కామ క్రోధ మోహ మద మాత్సర్యాలను విసర్జించి ధైర్యోత్సాహాలతో ఎదుర్కొంటూ సరళవంతమైన కొన్ని నైతిక ధర్మాలతో జీవితాన్ని క్రమబద్ధంగా నిర్మించుకోవాలి.

ఈ నైతిక ధర్మాలలో ముఖ్యాతి ముఖ్యమైన ధర్మయుక్తమగు న్యాయం, సరళవంతమైన అర్జనం,

(మిగతా 6 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### తీరిక లేనివారికే అవకాశం ఉంటుంది

తీరిక లేకుండా స్వధర్మాన్ని నిర్వర్తించుకునే వారికి మాత్రమే అవకాశం ఉంటుంది. కాని ఎప్పుడూ ఏదో కొంప మునిగిపోయేటట్టు పని ఉన్నట్టుగా పైకి హడావిడిగా కనిపించేవారికి పాపం అవకాశమే ఉండదు. ఆర్నాల్డ్ బెన్నెట్ సదా తెప్పమీద ప్రయాణాలు చేస్తూ. గుర్రపు పందాలకు వెడుతూ, రాత్రిళ్ళు విందులతో, వినోదాలతో కాలయాపన చేస్తున్నట్టే కనిపించేవాడు. కాని బెన్నెట్ అమూల్య గ్రంథాలు, వ్యాసాలు, కథలు ఎన్నో రచించాడు. సర్వసాధారణంగా ఇతరులు వృధాగా కాలయాపనలు చేసే సమయాలను ఇతడు సక్రమంగా వినియోగించుకున్నాడు.

సర్ విన్‌స్టన్ చర్చిల్ చాలా మటుకు రాజకీయ వ్యవహారాలలోనే తన కాలాన్ని వెళ్ళబుచ్చేవాడు. అయినా ఇతడు ఎన్నెన్నో గ్రంథాలను రచించాడు, పెయింటు చేసేవాడు, గోడలు నిర్మించేవాడు "నాకు తీరిక లేద"ని జీవితంలో అతడు ఎన్నడూ అనలేదు.

మనలో చాలామంది రైళ్ళలో ప్రయాణాలు చేస్తాం. రైలు ప్రయాణం చేస్తూ కిటికీలోనుంచి వ్యర్థంగా చూస్తూ ఉంటాము. కునుకిపాట్లు పడతాం, లేకపోతే ఊరికే కూర్చుంటాము. మైకేల్ గిల్బర్ట్ అనే ఒక న్యాయవాది ప్రతి

"మానవుని సుఖదుఃఖాలు అన్నా చెల్లెళ్ళలాగ ఎంతో జాలిగా చూస్తాయి"

రోజూ తన ఆఫీసుకు రైలులో ప్రయాణం చేస్తూ అపూర్వమైన గ్రంథావళి రచించాడు. సామాన్యంగా అందరికీ ఉండే 24 గంటల దినప్రమాణంలో క్రిక్కిరిసిపోయిన కార్యక్రమాలను ఇరుకించుకునే సమర్థులే అసాధ్యులైన మేధావులు!



సర్ విన్‌స్టన్ చర్చిల్

ప్రపంచంలో విజయాన్ని పొందినవారు తమ తమ తీరిక సమయాలను సద్వినియోగం చేసుకున్న ధీమంతులు. ఎడిసన్ సామానుల వేన్‌లో, రైలుబండిలో పరిశోధనశాల నిర్మించి పరిశోధనలను చేశాడు. ఇంటినుంచి బయలుదేరేటప్పుడు రాబర్ట్ స్టీవెన్‌సన్ రెండు పుస్తకాలు తీసుకువెడుతూండేవాడు. ఒకటి చదువుకోడానికి, మరొకటి నోట్సు వ్రాసుకోడానికి. లియోనార్డో-డా విన్సీ గొప్ప చిత్రకారుడని ప్రసిద్ధి పొందినా మిలటరీ ఇంజనీరింగ్‌లో, గణితశాస్త్రంలో, మెకానిక్స్‌లో అమోఘమైన కృషి సలిపాడు. 'సద్వినియోగం చేసుకునేవారికి కాలం కొలెడంత' అని ఇతడు చెప్పాడు.

వందలాది పారిశ్రామిక రంగాలలో కవి పెట్టుకుని ఉండవలసిన విరామ సమయం ఎంతో ఉంటుంది. అంటే ఆ యా సమయాలలో అనేక ఇతర ఉద్యమాలను, పనులను సాధించగలం.

ఎవరైనా ఏవైనా సమస్యలను పరిష్కరించమన్నప్పుడు గానీ, సాంఘికంగా సహకారం చేయమన్నప్పుడుగానీ "అయ్యయ్యో! నాకిప్పుడు అసలు తీరికలేదు" అనడం సహజం. అలాంటప్పుడు మీలో మీరు ప్రశ్నించుకోండి. "నేను కాలాన్ని ఎలా వినియోగించుకుంటున్నాను? దేనికి ప్రాముఖ్యత ఇస్తున్నాను? మొదట చేయవలసిన దానిని మొదట చేస్తున్నానా? లేదా ఏదైనా ఒక పనికి వినియోగించే కాలాన్ని తగ్గించి దాన్ని మరింత సద్వినియోగం చేసుకోగలనా?"

ఒకసారి చిరకాల స్నేహితుడు ఒక కంటి డాక్టరు ఇంటికి వెళ్ళాడు. గోడల మీద ఎక్కడ చూసినా చిత్రాలు, పెయింటింగులు చూచి ఆశ్చర్యంతో "ఏమిటి ఈ పెయింటింగులు ఎవరు వేశారు?" అని అడిగాడు.

(మిగతా 7 వ పేజీలో)

---

## నూతన వత్సర శుభాకాంక్షలు!

పాఠకులకూ, ఏజంట్లకూ,
ప్రకటనదారులకూ
మా హార్దికమైన నూతన వత్సర
శుభాకాంక్షలు.

-సంపాదకుడు.

"వ్యవహార శుద్ధికలుగుటయే సర్వజన ప్రియకారి యగుటకు మూలమగును"

# మత్తుమందు చరిత్ర

సి. హెచ్. జయదేవ్

ఈనాడు చికిత్సా విధానంలో శస్త్రచికిత్స చేయవలసి వచ్చినప్పుడు రోగికి వైద్యులు మత్తుమందు (anesthetic)



ఇస్తారు. దీనివలన రోగికి మత్తు కలుగుతుంది. అంటే స్పర్శజ్ఞానం తాత్కాలికంగా పోతుంది. మత్తుమందువల్ల రోగికి బాధ తెలియదు. అన్ని విధాల మత్తు మందులు నాడీ మండలం మీద ప్రభవిస్తాయి. నాడులను మెదడుకి వార్తలను పంపనీయకుండా చేస్తాయి. మత్తుమందులు సుమారు 100 సంవత్సరాల ముందు ఉపయోగంలోకి వచ్చాయి.

మానవునికి బాధ అనేది పుట్టుకతోనే వచ్చింది. కాబట్టి ప్రాచీన కాలం నుంచీ కూడా మానవుడు బాధా నివారణకు మార్గాలు వెతుక్కోడానికి ప్రారంభించాడు. ఈ ఉద్యమంలో జరిగిన అనేక పరిశోధనల ఫలితంగా కొన్ని చెట్ల నుండి తయారయే మందులు నొప్పిని నివారిస్తాయని తెలుసుకున్నాడు. ఇటువంటి ప్రత్యేక మందులలో నల్లమందు, మాన్‌డ్రేక్, గంజాయి (హషీష్) వంటివి కొన్ని రకాలు. అయినా ఇవి అంత ఉత్తమమైనవి కావు. చిన్న చిన్న మోతాదులలో రోగికి అసలు పనిచేయవు. కాగా ఎక్కువ మోతాదులు మారకాన్ని కలిగిస్తాయి సుమారు 1840 వరకూ కూడా శస్త్రచికిత్స చేయవలసి వచ్చిన రోగికి విరసాయకరమైన,



"సంసార బంధమునుండి తప్పించుకొనుటయే మోక్షమగును"

సంతృప్తికరమైన మత్తుమందును తెలుసుకోలేకపోయారు. కాబట్టి శస్త్రచికిత్స చేయవలసిన సమయంలో రోగి కాళ్ళు చేతులు కదపకుండా గట్టిగా పట్టుకునేవారు. చాలామంది రోగులు బాధను, భయాన్ని కూడా తట్టుకోలేక పోయేవారు.



హంఫ్రీ దవే

కొన్ని వాయువుల అధ్యయనంలో ఆధునిక మత్తుమందులను గురించి కొందరు తెలుసుకోగల్గారు. 1799 వ సం. లో ప్రసిద్ధ ఆంగ్లేయ రసాయనిక శాస్త్రవేత్త హంఫ్రీ దవే (Humphry Davy) శరీరంలో బాధను నివారించగల నైట్రస్ ఆక్సైడ్ మానవుడు రూపొందించగల మత్తుమందని వివరించాడు. కాని ఎన్నో ఏళ్ళు గతించాయి. దీన్ని ఎవరూ మత్తుమందుగా ఉపయోగించలేదు. తొలిసారిగా 'హెన్రీ హిల్ హిక్‌మన్' అనే బ్రిటిష్ వైద్యుడు మత్తుమందుగా ఒక వాయువును ఉపయోగించాడు. ఇతడు కార్బన్‌డై ఆక్సైడ్ మీద పరిశోధనలు జరిపాడు. 1824 వ సంవత్సరంలో ఇతడు జంతువుల మీద మత్తుమందును విజయవంతంగా ఉపయోగించాడు. కాని పెద్దపెద్ద శస్త్ర వైద్యులకు, ఇతర డాక్టర్లకు దీన్ని గురించి నచ్చచెప్పలేకపోయాడు.

ఇంతలో కొద్ది కొద్దిగా నైట్రస్ ఆక్సైడ్ వాయువుని ముక్కుతో పీలిస్తే ఒక విధమైన హాయిని కలిగిస్తుందని కొంతమంది తెలుసుకున్నారు. నైట్రస్ ఆక్సైడునే 'లాఫింగ్‌గాస్' అన్నారు. 1840 వ సం. నాటికి క్రొవ్వులు, ఇతర పదార్థాలు కరిగే రంగులేని ద్రవం ఈథర్‌ని పీల్చడంవల్ల కలిగే సుఖానుభవాలను గూర్చి కొంతమంది అవగాహన చేసుకున్నారు. ఈథర్ ఫ్రాలిక్స్ అనే చిన్న చిన్న పార్టీలను కూడా జరుపుకునేవారు. ఈ పార్టీలలో వైద్యులు, వైద్యశాస్త్రంఅధ్యయనం చేసే విద్యార్థులకు దీన్ని పరిచయం చేసారు.

( 31వ పేజీ తరువాయి)

సద్భావపూరితమైన నిష్కాపట్యం, దయామయమైన వాత్సల్యం అనునవి అనుసరించవలసిన ధర్మాలు.

నిత్య సత్యాలుగా ప్రకాశించే ఈ నాలుగు ధర్మాలు వాసయోగ్యమైన దివ్యభవంతికి పునాదులు వంటివి. నిర్లక్ష్యంతో వీటిని విస్మరించి అన్యాయాలతో, కుయుక్తులతో స్వార్థ పరాయణతతో సాధించిన తాత్కాలిక విజయం పునాదులు లేకుండా నిర్మించిన భవనం వంటిది అట్టి అవివేకుడు చిట్టచివరకు ఆశాభంగంతో అపజయానే పొందుచున్నాడు.

ఆ రోజులలో క్రాఫోర్డ్ దబ్ల్యు లాంగ్ ప్రసిద్ధి పొందిన శస్త్రవైద్యుడు. ఒక రోజున పార్టీలో పాల్గొని ఈథరు



డా. జేమ్స్ సిమ్సన్

గుణాన్ని తెలుసుకున్నాడు. అప్పుడు మత్తు మందులను గురించి అతడు పరిశోధించాడు. 1842 వ సం. లో ఒక రోగికి ఈథరు పీల్పించి మెడమీద కంతిని శస్త్రచికిత్స చేసి తీసివేయగలిగాడు. శస్త్రచికిత్సలో మానవుని మీద ప్రయోగించిన మొట్టమొదటి మత్తు మందు ఇదే. ఇతడు కూడా హెన్రీ హిల్‌లాగే దీనికి అంత ప్రచారం చేయలేకపోయాడు. ఇతడు సాధించిన విజయం ఇతర వైద్యులకు తెలియలేదు. డా. మార్టన్. డా. వారన్ అనే ఇద్దరు అమెరికన్ వైద్యులకు దీని ఘనత దక్కింది. ఇంతలో మరో అమెరికన్ వైద్యుడు, కవి అయిన ఆలివర్ వెండెల్ హోమ్స్ ఈథర్ వల్ల కలిగే మత్తుదనానికి 'ఏనెస్తీషియా'(anesthesia) అనే మాటను కల్పించాడు. గ్రీకు భాషలో 'ఎనెస్తీషియా' అంటే స్పర్శలేదని అర్థం.

ఈథర్ వాయువులవల్ల ఊపిరితిత్తులలో మంట కలిగేది కాబట్టి ఇంతకంటే ఉత్తమమైన వికటించని మత్తుమందులను తెలుసుకోవలసి వచ్చింది. కాబట్టి ఉత్తమరకం మత్తుమందులను వైద్యులు పరిశోధించడం ప్రారంభించారు. కొంతకాలానికి 'క్లోరోఫార్మ్' అనే పదార్థాన్ని కనిపెట్టారు. దీనిని కనిపెట్టినఘనత డా జేమ్స్ సిమ్సన్‌కు దక్కింది. ఇతడు 'క్లోరోఫార్మ్'కి మత్తుకలిగించే గుణం ఉందని చెప్పగలిగాడు. 1847 వ సం లో ప్రసవ సమయంలో ఒక స్త్రీకి దీనిని ఇచ్చి నొప్పులు లేకుండా సుఖ ప్రసవం కలిగించాడు. విక్టోరియా మహారాణి తన 7 వ కాన్పుకి క్లోరోఫార్మ్‌ను తీసుకున్న తరవాత 1853 లో దీనికి మిక్కిలి ప్రచారం, ప్రసిద్ధి ఏర్పడింది. ఆనాటి నుంచి అనేక రక

---

(4 వ పేజీ తరువాయి)

"నేనే వేశాను" అన్నాడు డాక్టరు. తీరిక లేకుండా తన వృత్తి ధర్మాన్ని బాధ్యతతో నిర్వర్తించుకునే డాక్టరును చూసి "ఎన్ని చిత్రాలు! నీకు తీరిక ఎక్కడ కనిపిస్తుంది" అని అడిగితే, డాక్టరు "తీరిక కనిపించదు. నేను తీరిక చేసుకుంటా" అన్నాడు. నాకు తీరిక లేదు అని ఎప్పుడూ చెప్పకద్దు. మనస్సు ఉంటే మార్గం ఎందుకుండదు? నీ చుట్టూ తీరికలేకుండా పనిచేసేవారిని అందరినీ చూడు, వారికి తమ తమ పనులు సాధించుకోడానికి తీరిక ఎక్కడనుంచి వస్తుందో తెలుసుకో. "దిన ప్రమాణాన్ని పొడిగించుకోవడం అంటే రాత్రుళ్ళు కొన్ని గంటలు వినియోగించు కోడమే" అని జార్జి ఆర్. సిమ్స్ అంటాడు

"వైఖరి గోడలు రెక్కలు లేనివారినే ఆటంక పరుపగలవు."

రకాల మత్తుమందులు అభివృద్ధి పొంది ఉపయోగంలోకి వచ్చాయి. మత్తు మందులలో ఒక్కొక్క రకానికి ఒక్కొక్క ప్రత్యేక గుణం ఉంది. ఈ నాడు శస్త్రవైద్యులు తమ రోగికి, శస్త్ర చికిత్సకి అనువైన మత్తు మందును ఎన్నుకోడానికి వీలుంటె.

మత్తుమందులు ముఖ్యంగా రెండురకాలు లోకల్, జనరల్. లోకల్ మత్తుమందువల్ల రోగికి దేహంలో ఆ ప్రత్యేక ప్రదేశంలో మొద్దెక్కిపోయి స్పర్శజ్ఞానం పోతుంది. జనరల్ మత్తుమందువల్ల పూర్తిగా రోగికి ప్రజ్ఞ తప్పిపోతుంది.

జనరల్ మత్తుమందు రక్తప్రవాహంలో చేరి ప్రభావితం అవుతూంటుంది. రక్త ప్రవాహం మందుని మెదడులోని కేంద్రనాడీ మండలానికి చేరుస్తుంది. మెదడులో జ్ఞాన నాడులమీద ఇది ప్రభావితమైనప్పుడు మెదడుకు వార్తలను పంపడం, గ్రహించడం అనే శక్తిపోయి తాత్కాలికంగా ప్రజ్ఞ నశిస్తుంది. జనరల్ మత్తుమందులలో ఉత్తమమైనది "ఈథర్" వాయువు.

లోకల్ మత్తుమందైనా, జనరల్ మత్తుమందైనా, ప్రత్యేక శిక్షణపొందిన మత్తుమందుల ఉపయోగం తెలిసిన నిపుణుడు మాత్రమే ఇవ్వాలి. మత్తుమందు ఇచ్చేటప్పుడు రోగి ఆయువు పట్టులను అతిజాగ్రత్తగా గమనించాలి. అంటే రోగి నాడీ. బ్లడ్‌ప్రెషర్, చర్మం రంగు, కళ్ళుతీరు మొదలైనవి అన్నీ మత్తుమందుకు ఎలా ప్రవర్తిస్తున్నాయో గమనిస్తూ ఉండాలి.

లోకల్‌గా ఇచ్చే మత్తుమందువల్ల శరీరంలో ఆ ప్రదేశంలో మాత్రమే మొద్దెక్కి స్పర్శజ్ఞానం పోతుంది. శస్త్రచికిత్స సులభంగా చేయవచ్చు. సాధారణంగా నోట్లో పళ్ళు తీసేటప్పుడు, ప్రసవ సమయాలలో దీన్ని ఇస్తారు.

మత్తుమందులకు లాభాలు,నష్టాలు రెండూ

(మిగతా 73 వ పేజీలో)

## కోపోద్రేకాన్ని అరికట్టాలి



దారి తప్పిపోతున్న రథాన్ని లాగిపట్టినట్టు కోపోద్రేకాన్ని అణచుకున్నవాడు రథసారధి. మిగిలినవారంతా త్రాళ్ళులాగే వారే.

మాట్లాడేటప్పుడు వచ్చే కోపాన్ని శాంతింపజేసుకుని నెమ్మదిగా ఇతరుల మనసును నొప్పించకుండా అహ్లాదకరంగా మాట్లాడటం అభ్యాసం చేసుకోవాలి.

మనస్సులో చెలరేగే కోపాన్ని పోగొట్టుకోవాలి. మనస్సు స్వాధీనం చేసుకొని ధర్మయుక్తంగా మాట్లాడటం అలవాటు చేసుకోవాలి.

—అంత.

"జ్ఞాతులు పరస్పరము పోరులేక కూడిమనుటయే సర్వసుఖములకు మూలం."

# తల మీద కాళ్ళుండే సెపియా

కె. ఎస్. ఎస్. మూర్తి

'సెపియా' కాళ్ళు తలమీద ఉండే సముద్రపు జంతువు. ఈ చెందిన జంతువులను 'సెఫాలోపోడా' (Cephalopoda) అంటారు. సాధారణంగా దీనినే 'కటిల్ ఫిష్' (cuttle fish) లేక 'స్క్విడ్' (squid) అని కూడా అంటారు. వీటికి తల మొండెము కంఠంతో చేర్చబడి ఉంటుంది.




సెపియా

ఇవి తలమీద పెరిగే పది (decapod) కాళ్ళ సహాయంతో చుట్టుపక్కల దొరికే ఆహారాన్ని నోటిలో వేసుకుంటాయి. ఈ పది కాళ్ళలో రెండు తక్కిన వాటికంటే పొడవుగా ఉంటాయి. వీటి కాళ్ళు పీల్చుకునే సదుపాయంతో పొడుగా చాచుకోడానికి వీలుగా ఉండడంవల్ల ఆహారాన్ని అతి సులభంగా పట్టుకోడానికి వీలు కలుగుతుంది.

వస్త్రం కుండేటట్లు పైన ఉండే గుల్ల సెపియాకు ఆధారం, రక్షణ కూడా. కారణాంతరాలవల్ల ఇవి గుంపులు గుంపులుగా చచ్చిపోయినప్పుడు పై గుల్లలు సముద్రపు ఒడ్డుకు కొట్టుకు వస్తాయి. వీటిని సాధారణంగా ఫొటోలకు అద్దాలు ఫ్రేములు కట్టే వారు అద్దాలను శుభ్రం చేయడానికి ఉపయోగిస్తుంటారు.

సెపియా నీటిలో ఈదడం చాలా వింతగా, ఆశ్చర్యకరంగా ఉంటుంది. తల క్రింద గొట్టంలా ఉండే భాగాన్నుంచి నీటిని పైకి విరజిమ్ముకుంటూ వెనకకు చాలా వేగంగా వెడతూ ఉంటుంది. అయినా ఫిన్ రెక్కలు, చేతులు ఉపయోగిస్తూ ముందుకు కూడా చాలా వేగంగా సెపియా ఈదగలదు. సెపియా శరీరంలో ఉండే ఒక రకమైన 'సిరా గ్రంథులు' Ink glands) ద్వారా నీలవర్ణపు నల్లటి ద్రవాన్ని నీటిలోకి విడుస్తూ ఉంటుంది. ఈ ద్రవం నీటి మీద నల్లగా తాత్కాలికంగా ఒక మేఘపు తెరలా విస్తరించుకుంటుంది. దీనివల్ల ఇది శత్రువుల నుండి రక్షించుకోవడమే కాకుండా తన

(మిగతా 14 వ పేజీలో)

"కోకిలగన్న చోట గుమిగూడి యసహ్యపు
కూతలార్చుచుం గాకులు తన్నవే?"

# వాహ చట్టం

ప్రాచీన హిందూ ధర్మశాస్త్ర ప్రకారం బ్రాహ్మము, దైవతము, ఆర్షము, ప్రాజా



పత్యము, గాంధర్వము, ఆసురము, రాక్షసము, పైశాచము అని ఎనిమిది విధాల వివాహాలు వివరింపబడ్డాయి. వీటిలో బ్రాహ్మము, దైవతము, ఆర్షము, ప్రాజాపత్యము అంగీకరింపబడ్డాయి. మిగిలిన నాలుగు విధాల వివాహాలు అంగీకరింపబడలేదు.

బ్రాహ్మము, ఆసురము వివాహాలు మాత్రమే ఈనాడు ఆచారంలో ఉన్నాయి. హిందువులలో ఏజాతికి చెందిన వారైనా ఇప్పుడు వివాహాలలో బ్రాహ్మముగానీ, అసురముగానీ అనుసరించాలి.

1955 వ సం. పు హిందూ వివాహచట్టం అమలుపరచిన తరువాత హిందువుల వివాహ విధానంలో అనేక మార్పులు - కూర్పులు - చేర్పులు ఏర్పడ్డాయి. తొలిసారిగా చట్టాన్ని అనుసరించి భార్యా భర్తల ఎడబాటు (Separation), పునఃప్రతిపాదిత వైవాహిక జీవితం (Restitution), విడాకులు (Divorce) అనేవి నిర్ణయింపబడ్డాయి. బహుభార్యాత్వము (bigamy) శిక్షింపదగిన నేరంగా నిర్ణయించారు. 1955 వ సం. పు హిందూవివాహ చట్టాన్ని సవరిస్తూ నిర్ణయింపబడిన 1976 సం.పు హిందూ వివాహ సవరణ చట్టా (Marriage Laws Amendment Act 1976)న్ని అనుసరించే ప్రస్తుత పరిస్థితులను పరిశీలించవలసి ఉంది.

హిందూ వివాహ చట్టం ఎవరికి వర్తిస్తుంది?

1. వీరశైవ, లింగాయతులు గాని లేక బ్రహ్మ సమాజం, ప్రార్థనా సమాజం లేక ఆర్యసమాజానికి చెందిన వారితో కూడా

---

## సెంచరీ గెలుచుకున్న బాలుడు

1961 వ సం. ఫిబ్రవరిలో ఢిల్లీలో 101 కి ఇండియాకు మధ్య జరిగిన క్రికెట్ పోటీలో పాకిస్థాన్‌కు చెందిన 17 సం 82 రోజుల వయస్సు గల ముస్తాక్ మహమ్మదు తన 6 వ టెస్ట్‌లో అతి తక్కువ వయస్సులో సెంచరీ గెలుచుకుని ప్రపంచ రికార్డు స్థాపించాడు.

"లోక వ్యవహారాలను ధర్మబద్ధంగా
నిర్వహించ గలిగినవాడు తెలివిగలవాడు."

హిందూమతం, దానికి సంబంధించిన వారికి.

2. బౌద్ధ, జైన లేక సిక్కుమతానికి చెందిన ఏ వ్యక్తినైనా.

3. ముస్లిం, క్రిస్టియను, పార్శీ లేక జ్యూ మతాలకు అనువర్తించకుండా ఈ చట్టం అమలుపరచగల ప్రదేశాలలో నివసించే ఏ ఇతర వ్యక్తికైనా.

హిందూ వివాహ నిబంధనలు:

1. వివాహ సమయానికి ముందు వధూవరులకు భార్యగానీ, భర్తగానీ జీవించి ఉండకూడదు. అంటే వివాహ సమయానికి ముందు భర్తకు భార్యగానీ, భార్యకు భర్తగానీ జీవించి ఉండకూడదు.

2. భార్యగానీ, భర్తగానీ (a) మానసిక అస్వస్థతవల్ల ప్రామాణికమైన అంగీకారం



చెప్పలేక పోయినప్పుడుగానీ. (b) ప్రామాణికంగా అంగీకారం చెప్పగలిగినా మానసిక అస్వస్థతతో బాధపడేవారు, సంతానోత్పత్తికి వీలులేని మానసిక జాడ్యంతో బాధపడేవారు లేక (సి) భ్రమ, మూర్ఛరోగాలతో బాధపడేవారు వివాహానికి అనర్హులు.

3. వివాహ సమయంలో వరునికి 21 సంవత్సరాలు. వధువుకి 18 సంవత్సరాలు నిండి ఉండాలి.

4. వారి వారి ఆచారాలనుబట్టి ఇద్దరికి వివాహం ప్రామాణికంగా అనుమతింపబడినదైతేనే తప్ప వధూవరులు నిషేధింపబడిన దగ్గర తరానికి సంబంధించినవారై ఉండకూడదు.

హిందూ వివాహం వధూవరులు ఇద్దరికి వారివారి ఆచారాలను అనుసరించి శాస్త్రయుక్తంగా యథావిధిగా జరుపదగినది. యథావిధిగా శాస్త్రయుక్తంగా జరిగే తంతులో 'సప్తపది' (యజ్ఞవేదిక ముందు వధూవరులు కలిసి నడువవలసిన ఏడడుగులు)లో ఏడవ అడుగు పెట్టిన తరువాతే వివాహం పూర్తి అవుతుంది బ్రాహ్మము అయినా అసురము అయినా హిందూ వివాహం అనుమతింపబడడానికి (a) వివాహ హోమము (b) సప్తపది అనే రెండు తంతులు, కార్యక్రమాలు

## ప్రపంచంలో అతి శీఘ్రంగా పెరుగుతున్న బ్యాంకు

ప్రపంచంలో స్టేటు బ్యాంక్ ఆఫ్ ఇండియా ఆస్తుల దృష్ట్యా 11 వది గానూ, డిపాజిట్ల దృష్ట్యా 14 వది గానూ అతి శీఘ్రంగా వృద్ధి పొందుతూంది అని అమెరికాలో హవాయి ద్వీపకల్పాలలో హోనోలులులో ఇన్‌స్టిట్యూషనల్ ఇన్వెస్టార్ అనే పత్రిక జరిపిన సర్వేవల్ల తేలింది. 95,000 మిలియన్ డాలర్ల డిపాజిట్లతో బ్యాంక్ ఆఫ్ అమెరికా ప్రథమస్థానం పొందుతూంది.

"మోక్షంకోసం ప్రయత్నించడంలోనే ఉంది మానవత్వం."

విధిగా జరిగి తీరాలి. పైన వివరించిన కార్యక్రమాలతోనే గాకుండా వధూవరులకు ఆ యా కులమత ఆచారాలచే అనుమతింప బడిన, విధింపబడిన విధంగా వివాహం పూర్తి కావింపబడవచ్చు. హిందూ వితంతు



పునర్వివాహ, చట్టం ప్రకారం వితంతువుల వివాహ విషయంలో శాస్త్రసమ్మతమైన కార్యక్రమాలు ఇతర తంతులు అవసరం లేదు. ఇప్పుడు శాస్త్రయుక్తంగా యథావిధిగా విధింప బడిన తంతు ప్రకారం జరిగిన వివాహాలు కూడా ప్రత్యేకంగా ప్రభుత్వం వారిచే దీని నిమిత్తం ఏర్పాటు చేయబడిన అధికారి సమక్షంలో రిజిస్టరు చేసుకోవచ్చు. అట్టి వివాహాలు ఆ అధికారిచే దానికొరకై ప్రత్యేకంగా ఏర్పాటైన వివాహాల రిజిస్టరులో నమోదు చేయ బడుతుంది.

హిందూ వివాహ చట్టంలో తొలిసారిగా దాంపత్య హక్కుల పునః ప్రతిపాదన (Restitution of Conjugal Rights) నిబంధన చేర్చబడింది. అంటే భర్తగానీ, భార్యగానీ యోగ్యమైన లేక న్యాయమైన కారణం లేకుండా పరస్పర సంబంధం లేకుండా విడిపోయినప్పుడు అన్యాయం జరిగినవారు జిల్లాకోర్టులో దాంపత్య హక్కులకు ఫిర్యాదు చేసుకోవచ్చు.

అదే విధంగా హిందూ వివాహచట్టం అమలులోకి రావడానికి ముందుగానీ తరువాత గానీ జరిపిన వివాహంలో భార్యా భర్తలలో ఎవరైనా చట్టానికి సంబంధించిన 13 (1) సెక్షను ప్రకారం న్యాయసమ్మతంగా ఎడబాటు పొందడానికి ఫిర్యాదు చేసుకోవచ్చు. న్యాయబద్ధంగా డిక్రీ పొంది విడిపోయి నప్పుడు అర్జీదారు (Petitioner) కి ప్రతివాది (respondent) తో ఏవిధమైన లైంగిక సంబంధానికి హక్కు ఉండదు. కానీ వాది, ప్రతివాదులలో ఏ ఒక్కరైనా పిటిషను పెట్టుకుంటే దాని నిజా నిజాలనుబట్టి కోరువారు మొదటి డిక్రీని రద్దు చేయవచ్చు.

1955 వ సం ॥ హిందూ చట్టానికి ముందుగానీ, తరువాతగానీ వివా

## సాంకేతిక పదాలు

| | |
|---|---|
| OED | : ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీ |
| OIGS | : ఆన్ ఇండియా గవర్నమెంట్ సర్వీస్ |
| PIN CODE: | పోస్టల్ ఇండెక్స్ నంబర్ కోడ్ (ఇండియా) |
| RLO | : రిటర్న్‌డ్ లెటర్స్ ఆఫీస్ |
| SDR | : స్పెషల్ డ్రాయింగ్ రైట్స్ |
| WAY | : వరల్డ్ అసెంబ్లీ ఆఫ్ యూత్ |
| SST | : సూపర్‌సోనిక్ ట్రాన్స్‌పోర్ట్ |

"సౌఖ్యం ఇతరుల తోటల్లో పండదం లేదు. నీ పెరట్లో పెరిగేదే."

హంలో భార్య లేక భర్త పెట్టుకున్న అర్జీని అనుసరించి క్రింది కారణాలనుబట్టి విడాకు లకు అనుమతిని పొందవచ్చు.



1. అతడు లేక ఆమె దంపతులుగా ఉంటూ ఏ ఇతర వ్యక్తితోనైనా ఇచ్ఛా పూర్వకంగా లైంగిక సంపర్కం కలిగి యున్నప్పుడు,

2. అర్జీదారుని హింసపెట్టినప్పుడు,

3 అర్జీదారుని వదలివేసి రెండు సంవత్సరాల కంటే తక్కువ కానప్పుడు,

4. ఇద్దరిలో ఏ ఒకరైనా మతం మార్చు కుని ఇంకో మతంలో చేరి హిందూమతాన్ని వదలుకున్నప్పుడు,

5. కుదరని మనోరోగం వల్ల లేక మనో వైకల్యంచేత బాధపడుచున్నప్పుడు,

6. కుదరని తీవ్రమైన కుష్టువ్యాధి, ఇతర శరీర వ్యాధులతో బాధపడుచున్నప్పుడు,

7. సంసారాన్ని వదలి సన్యాసాన్ని స్వీక రించినప్పుడు,

8. ఏడు సంవత్సరాలు లేక అంతకు పైబడి ఏ సమాచారం తెలియనప్పుడు.

అయినా కోర్టువారు విడాకులకు అను మతిని ఇవ్వక చట్టరీత్యా ఎడబాటు చేయవచ్చు. భార్యాభర్తలు ఇద్దరూ ఒక సంవత్సరం లేక దానికి పైబడ్డ కాలంనుంచి విడి విడిగా ఎడ బాటుగా జీవిస్తున్నామని తాము చేరి జీవించ లేక పోతున్నామని మరియు తమ వివాహం రద్దుకి పరస్పరం ఒప్పందం చేసుకున్నామని విడాకులకు అర్జీ పెట్టుకోవచ్చు.

భార్యా భర్తలలో భార్యగానీ, భర్తగానీ జీవనం గడుపుకోవడం కష్టంగా ఉందని కోర్టు సమక్షానికి నిరూపించుకో గలిగితే కోర్టువారు ప్రతివాదిచేత అతడికి/ఆమెకి యావజ్జీవం మనోవర్తి క్రింద కొంత

## ముత్యాలవ్యాఖ్య

(నవంబరు 1985)

"ప్రతీసారి శృంగారంతో వస్తే
ఈ సారి వీరంతో వచ్చింది"
—శ్రీ లక్ష్మీసీతారామాంజనేయ శాస్త్రి,
జిల్లేళ్ళమూడి, (గుంటూరు జిల్లా)

* * *

"యుద్ధంలో సత్యభామ విజయం
పత్రికల్లో 'విస్డమ్' విజయం."
—ఎన్. దయాకర్, హనుమకొండ,
(వరంగల్ జిల్లా)

* * *

"ఆడది అబల కాదు సబలే."
—ఆర్. శ్రీనివాస్, శ్రీకాళహస్తి,
(చిత్తూరు జిల్లా)

"అదృష్టానికి, దురదృష్టానికి మనసే కారణం."

సొమ్మును చెల్లింప జేస్తారు. దీనినే పెర్మ నెంట్ అలిమనీ అంటారు. కేసు తీర్పుకు ముందు కూడా ప్రతివాది మనోవర్తి కోరవచ్చు. తీర్పులో కోర్టువారు వారి సంతానం ఎవరి స్వాధీనంలో ఉండవలసినది, పిల్లల సంరక్షణ ఎవరు చేపట్టాలి అనే విషయాలను నిర్ణయిస్తారు.

1954 వ సం.పు ప్రత్యేక వివాహ చట్టాన్ని అనుసరించి హిందువులు దీనికై ప్రత్యేకంగా నియమింపబడిన అధికారి (మేరేజ్ ఆఫీసరు) సమక్షంలో పెళ్ళిళ్ళను రిజిస్టరు చేసుకోవచ్చు. నోటీసులు పంపడం ద్వారాను మరియు ముగ్గురు సాక్షులతో మారేజి ఆఫీసర్ సమక్షంలో యథావిధిగా వివాహం ప్రమాణీకం చేసుకోవచ్చు. ప్రత్యేక మారేజెస్ ఆక్టు ప్రకారం యథావిధిగా జరిగిన పెళ్ళికి వివాహం ప్రమాణీకరింపబడినట్టు ఒక సర్టిఫికెట్టు కూడా ఇవ్వబడును. ఈ సందర్భంలో వివాహాలకు మరియు ఇతర కుటుంబ వ్యవహారాలకు సంబంధించిన విషయాలను, సమస్యలను అతి శీఘ్రంగా తీర్చి పరిష్కరించి సమాధానపరచడానికి ప్రత్యేకంగా ఏర్పాటు కావింపబడిన ఫామిలీ కోర్టుల నియామకానికి పార్లమెంటు ఆమోదించిన 1984 వ సం.పు (1984 వ సం.పు, 66 వ ఆక్టు) ఫామిలీ కోర్ట్సు ఆక్టును కూడా పరిశీలింపవలసి ఉంటుంది.

(9 వ పేజీ తరువాయి)

ఆహారాన్ని సులభంగా పట్టుకోగలుగుతుంది. వీటి సిరాగ్రంధు (Ink gland) ల నుండి స్రవించే ద్రవంతో హోమియోపతి వైద్య విధానంలో సెపియా అనే సుప్రసిద్ధ ఔషధం తయారు చేస్తారు. స్త్రీలకు సంభవించే అనేక రోగాలకు సెపియా దివ్య ఔషధంగా పని చేస్తుంది.

సెపియా జీవించినంత కాలం పెరుగుతుంది. సాధారణంగా 16 మీటర్ల నిడివిగా పెరుగుతుంది చేపలు, రొయ్యలు, చిన్న చిన్న పురుగులే గాక సముద్రంలో దొరికే చిన్న చిన్న జంతువులు కూడా దీనికి ఆహారం.

## భూమి వ్యాసంలో నాల్గవ వంతు చంద్రమండలం వ్యాసం



చంద్రమండలం వ్యాసం సుమారు 2,163 మైళ్ళు. ఇది అమెరికాలో న్యూయార్కు కాలిఫోర్నియాల మధ్య ఉండే దూరంకంటే తక్కువ. సుమారు భూమండలం వ్యాసంలో ఇది నాల్గవ వంతు ఉంటుంది.

"శరీరము అనిత్యం గనుక చేయదలచిన పుణ్యకార్యము నేడే చేయుట ఒప్పు."

# చిట్టిదేవతలకు చిన్నకథలు

## నీ హృదయం నిష్కళంకం, నిర్మలం అందుకే నేను కనిపిస్తా

అది ఒక చిన్న ఊరు. ఆ ఊళ్ళో ఒక పేద బ్రాహ్మణస్త్రీ నివసిస్తూ ఉండేది. ఆమెకు ఒకే ఒక చిన్న కొడుకు. భర్త ఏనాడో



మరణించడంచేత తండ్రి లేని ఆ కుమారుణ్ణి పెంచి పెద్ద చేయడం, చదివించడం మొదలైన బాధ్యతలన్నీ ఆమే నిర్వహించవలసి వచ్చింది. ఉచితంగా విద్య నేర్పించడానికి దగ్గరలో ఉన్న ఒక గురువుగారి దగ్గరకు రోజూ కొడుకును పంపేది. ప్రతిరోజూ ఆ చిన్న పిల్లవాడు ఉదయం బయలుదేరి వెళ్ళి సాయంకాలానికి ఒంటరిగా చీకటో అడవి దారిన ఇంటికి తిరిగి వస్తూ ఉండేవాడు.

"అమ్మా! నాకు భయం వేస్తోంది. ఒంటరిగా చీకట్లో రాలేనమ్మా!" అని బాలుడొకసారి తల్లితో చెప్పాడు.

"భయం వేస్తేనువ్వేమి చేయాలో చెబుతాను విను. మన గొల్లపిల్లవాడు కృష్ణుడు అక్కడే అడవులలో తిరుగుతూ ఉంటాడు. వాణ్ణి పిలిస్తే నీకు సాయంగా ఉంటాడు. భయం ఉండదు" అని తల్లి ధైర్యం చెప్పింది.

సంతోషంతో మరునాడు ఉదయం యధా

**"కాలగమనమున కలుగు మార్పులకు లోనగుచునే సాహిత్యగతి వివిధ మార్గాలను అనుసరిస్తుంది."**

ప్రకారం ఆ బాలుడు పరుగెత్తుకుంటూ అడవి దారిన వెడుతూ "అన్నా! కృష్ణా! ఎక్కడున్నావు? నాకు భయం వేస్తూంది" అని పిలిచాడు వెంటనే దూరం నుంచి "నేను ఇక్కడే ఉన్నాను. ఏం భయంలేదు" అన్న మాటలు వినిపించాయి. బాలుడికి ధైర్యం వచ్చింది. ఆ నాటి నుంచీ ప్రతీ రోజూ అడవిలో దూరంగా ఒంటరిగా గురువు గారింటికి నడిచి వెళ్ళేటప్పుడు బాలుడు కృష్ణుణ్ణి పిలుస్తూ ఉండేవాడు ఆ కృష్ణుడు ప్రత్యక్షమై ఏవేవో కబుర్లు చెప్పి నవ్విస్తూ వాణ్ణి అడవి దాటించేవాడు.

ఒకరోజు గురువుగారి ముసలి తండ్రి మరణించాడు. కర్మలు అన్నీ అయినాయి. వైకుంఠ సమారాధన ఏర్పాటు చేశారు. విద్యార్థులందరినీ పెద్ద పెద్ద బహుమానాలు తీసుకురమ్మని ఆదేశించారు. ఉన్నవాళ్ళ పిల్లలు విలువైన కానుకలు ఎన్నెన్నో తీసుకు వెళ్ళారు ఈ పిల్లవాడి తల్లి నిరుపేద. ఏదైనా ఇవ్వాలనుకుంటే చిల్లిగవ్వ లేదు.

"అమ్మా! మనం ఏం కానుక ఇద్దాం!" అని బాలుడు తల్లిని అతి దీనంగా నిరాశతో అడిగాడు. "అన్న ఉన్నాడు గదా! అడుగు. నీకు ఏం కావాలనుకుంటే అది ఇస్తాడు" అని తల్లి చెప్పి పంపింది. బాలుడు అడవులలో వెడుతూ తన అన్న కిష్టన్నను పిలిచి సంగతులన్నీ చెప్పాడు. అడిగాడో లేదో వెంటనే ఒక చిన్న పాలముంత బాలుడికి ఇచ్చి, ఓదార్చి "దీనిని మీ మేష్టారికి కానుకగా ఇవ్వు" అన్నాడు.

పట్టరాని సంతోషంతో ఆ బాలుడు పాల ముంతను పట్టుకుని గురువుగారింటికి పరుగెత్తుకుంటూ వచ్చి గురువుగారితో "ఇదిగో నండి పాలు" అని ఆ పాలముంత ఇవ్వబోయాడు. మేష్టారికి ఒళ్ళు మండి ఆ పాల ముంతను చూచి చీదరించుకుని ఒక పనివాణ్ణి పిలిచి ఆ పాలు తీసుకుని పిల్లవాణ్ణి పంపి వేయమన్నాడు.

ఆ పనివాడు ఆ పాలముంత తీసుకుని పాలు ఇంకో గిన్నెలోకి వంచాడు. వెంటనే ముంత మళ్ళీ పాలతో నిండిపోయింది ఎన్ని సార్లు ఒంచినా ప్రతీసారీ ముంత మళ్ళీ పాలతో నిండిపోతూంది. ముంత ఖాళీ చేయలేకపోతున్నాడు. "ఎక్కడ పట్టుకొచ్చావు ఆ ముంత?" అని గురువుగారు ఆశ్చర్యంతో అడిగాడు. "అడవిలో వచ్చేటప్పుడు మా గొల్ల కిష్టన్న ఇచ్చాడు" అని నవ్వుతూ పిల్లవాడు జవాబు ఇచ్చాడు. "ఏమిటీ! కృష్ణుడా! నీ కిచ్చాడా?" అని ఎగతాళీ చేస్తూ అడిగాడు గురువుగారు. "ఔను! ఔను! కిష్టన్నే ఇచ్చాడు! నాకు రోజూ భయం లేకుండా సాయం కూడా వస్తాడు" అని బాలుడు

(మిగతా 69 వ పేజీలో)

## వృక్షం శీఘ్రంగా పెరగాలంటే

ఒక చెట్టును ప్రతీరోజూ 30 సెకండ్ల పాటు మెల్లిగా కుదిపితే చెట్టు మామూలు కంటే బలిష్ఠంగానూ, శీఘ్రంగానూ పెరుగుతుందని అమెరికాకు చెందిన ప్రొ. రిచర్డ్ హారిస్ అభిప్రాయం.

"విగ్రహం శిల, గుడి శిల దేన్ని ఆరాధిస్తావు? రెండూ శిలలే!
యోగధారణచే మనస్సును లగ్నమొనర్చి ధ్యానం చేయి."

# మణిపూరిని నా అనుభవం

జనరల్ ఎ. ఎస్. వైద్య



[నేడు మనదేశ సంరక్షణకు డిఫెన్స్ సర్వీసెస్‌లో మిక్కిలి ప్రసిద్ధిని గాంచి ఘనుడనిపించుకున్న జనరల్ అరుణ్‌కుమార్ శ్రీధర్ వైద్య సైనికోద్యోగులకు ముఖ్య అధికారి. 1965 వ సం. లో, తిరిగి 1971 వ సం. లోను దేశ సంరక్షణోద్యమాలలో పాల్గొని మహావీరచక్ర బిరుదును, శాంతి సమయపు కార్యక్రమాలలో 'పరమ విశిష్ట సేవా, మరియు 'అతివిశిష్ట సేవా' పతకాలను గ్రహించారు. ఎంతటి కష్ట పరిస్థితులలోనైనా మానసిక శాంతే విజయానికి ముఖ్యమైన సాధనమని వీరి దృఢ నమ్మకం.]

పన్నని కొండ లోయలలో ప్రవహిస్తూ నాగాలాండ్‌లో అనేక పర్వతాలను చుట్టి బర్మా సరిహద్దులలో ప్రవహించే 'టిజు' అత్యంత సుందరమైన నదీ ప్రవాహం. ఈ అందమైన నదీ ప్రవాహానికి తూర్పుదిక్కుగా 13,000 అడుగుల ఎత్తుగా ఉండే సారామతి పర్వతశ్రేణి అతి గంభీరమైనది. ఈశాన్య దిక్కుగా సూర్యుడు అస్తమించి అతి శీఘ్రంగా సంధ్య పడిపోతుంది. తూర్పుగా ఉన్న కొండ అంచుల మీద నుండని చూస్తూ

## మీరైతే...?

(నవంబరు 1985)

(జీవితం వెనక్కు నడిస్తే...?)

"బోసి నవ్వులతో అమ్మ ఒడిలో మరోసారి ఆడుకుంటా!"

-గుడ్ల సంజీవరావు, కల్యాణ సింగుపురం, (ఒరిస్సా)

* * *

"చేసిన తప్పులు సరిదిద్దుకుంటా!"

—ఎస్. దయాకర్, హనుమకొండ, (వరంగల్ జిల్లా)

* * *

"భూతకాలం గురించే ఆలోచిస్తా"

—బి. ఎస్. వి. బి. రాజా, జేకేపూర్, (ఒరిస్సా)

"ఇతరులతో సరిపోల్చకుండా నీ జీవితాన్ని నీవు జీవించు."

ఉంటే ఆ స్తమిస్తున్న సూర్యకిరణాలు ఆ నదిలో వివిధ వర్ణాలతో ప్రతిబింబిస్తాయి.

1968 వ సం.రం. అది శీతాకాలం. చైనాలో శిక్షణను పొంది వారివద్ద నుంచి వివిధ ఆయుధాలను, మందుసామగ్రిని గ్రహించి అండర్‌గ్రౌండ్ నాగాలు 300 మంది తిరిగి రాబోతున్నారని మాకు ముందే తెలుసు. వీరు దేశంలో ప్రవేశించి ప్రశాంతంగా జీవితం గడుపుకుంటున్న నాగా జాతులను ఎదిరించి, వారికి భయోత్పాతాన్ని కలిగించడమే వీరి ముఖ్యోద్దేశం. లోపలకు ప్రవేశించే ముందే వీరిని అటకాయించి పట్టుకోవాలని అనుకున్నాం.

వర్షాకాలంలో 'టిజు' అతి భయంకరమైనది. శీతాకాలంలో కూడా దీనిని దాటటం సులభసాధ్యం కాదు. నేను బ్రిగేడు కమాండరుని అవడంచేత నాకు తీరికే ఉండేదికాదు. నా సైనికులను కలుసుకోడానికి, ఊళ్ళో జనాన్ని కలుసుకోడానికి, అచ్చట ప్రాంతీక వివరాలను గ్రహించడానికి, అండర్‌గ్రౌండ్ నాగాలు దేశంలోకి ప్రవేశించకుండా ఆ మార్గాలను సంరక్షించడానికి నేను రోజూ 14 గంటలు నడవవలసి వచ్చేది.

రాత్రి అయింది. వైర్‌లెస్ సెట్టులో వార్తలు వినిపిస్తున్నాయి పోరాటవాదులైన అండర్ గ్రౌండ్ నాగాజాతులలో కొంత మందిని నిర్ణయించుకున్న ప్రదేశంలో పట్టుకున్నట్లు సమాచారం అందింది. వెంటనే వీరిని చూడ్డానికి టిజు నదికి తూర్పుగా ఉన్న లారురీ గ్రామానికి బయలుదేరాను. అక్కడ ఒక దృశ్యాన్ని చూసి నిర్ఘాంతపోయాను. 17 సం.ల నాగా బాలుడు చిక్కిపోయి కళ్యంలా ఉన్నాడు. వంటి మీద దుస్తులు వదులుగా వ్రేలాడుతున్నాయి. భయంతో వణికిపోతున్నాడు అమాయకుడుగా కనిపిస్తున్నాడు. ఆ బాలుణ్ణి చూసిన వెంటనే మనస్సు కరిగిపోయింది దగ్గరకు వెళ్ళాను. కుర్రవాడి భుజాలు తట్టి భయపడవద్దు అని ధైర్యం చెప్పి ఉత్సాహం కలిగించాను. పట్టుబడిన అచ్చటి నాగాలకు తిండిపెట్టి బట్టలు ఇచ్చారు. గార్డులు వారిని పారిపోకుండా రక్షిస్తున్నారు.

---

## కుష్టురోగులలో 30 శాతం చిన్నపిల్లలు




ప్రపంచంలో ప్రతీ మూడు కుష్టురోగులలో ఒకడు భారతీయుడు. ప్రస్తుతం భారత దేశంలో 3½ లక్షల రోగులను గుర్తించారు. ముఖ్యంగా సంఘంలో ఉండే కళంకంవల్ల ఇంకా చాలామంది లెక్కలోకి రాలేదు. కొత్తగా కనిపెట్టబడిన వారిలో 30 శాతం చిన్నపిల్లలే.

---

"పూవిన భాగ్యరేఖ చెడిపోయిన పిమ్మట నెంతటి మానవుండైనను వాని నెవ్వరు ప్రియంబున బలుకరు, పిలువరు."

రాత్రి చాలా పొద్దు పోయింది. కొంచెం సేపు పడుకుందామని బయలుదేరుతున్నా. ఇంతలో ముసలి వృద్ధ దంపతులు ఇద్దరు నన్ను చూడడానికి వచ్చారు. ఇదివరకు సరిహద్దు ప్రాంతాలను కాపలా కాస్తున్నప్పుడు వారు అక్కడ నాకు పూర్వమే పరిచయమయ్యారు.

ఆ వృద్ధురాలు దుఃఖంతో కళ్ళు తుడుచుకుంటూ తన వృత్తాంతం చెప్పటం ప్రారంభించింది. సుమారు పది సంవత్సరాల క్రితం 6 ఏళ్ళ తమ కుమారుడు ఆడుకుంటూంటే అండర్ గ్రౌండు నాగాలు ఎత్తుకుపోయారు. ఆ వృద్ధ దంపతులకు ఒక్కడే కొడుకు.

ఆ తరువాత తమ కుమారుని సంగతే కొంతకాలం వరకు తెలియలేదు. ఆ కుర్రవాడు పనిమనిషిగా, వంటవాడిగా పడుతున్న కష్టాలన్నీ వారికి మెల్లి మెల్లిగా తెలిసాయి. అండర్ గ్రౌండ్ నాగాలతోటే కలిసిపోయినట్టు తెలిసింది ఇప్పుడు ఈ కుర్రవాడు పట్టుబడ్డాడు. చిక్కిపోయిన తన కుమారుణ్ణి చూసి తల్లి వల వలా ఏడ్చింది. 10 సంవత్సరాల తరువాత కనిపించిన తన కుమారునికి తిండి పెడదామనుకుంది. ఆ దంపతులను నాకు ముందే తెలుసు కాబట్టి వారిని సమాధాన పరచాను. అయితే నా కొక సందేహం వచ్చింది. ఈ తీవ్రవాదులే తలిదండ్రుల వేషంలో వచ్చారేమో, కుర్రవాణ్ణి తీసుకుపోయి చంపేస్తారేమో, మా సైన్యానికి చెడ్డ పేరు వస్తుందేమో అనే అభిప్రాయాలు ఎన్నెన్నో బయలుదేరాయి.

కాని ఆ ముసలి తల్లిదండ్రుల యథార్థస్థితి చూచిన తరువాత నిజం తెలుసుకోగలిగాను. వారిని మరునాడు ఉదయమే వచ్చి తమ కుమారుణ్ణి కలుసుకోమని చెప్పాను. తెల్లవారక ముందే నేను బయలుదేరి క్యాంపులోకి వెళ్ళాను. ఆ నాగా యువకుడు ఆకుపచ్చని మిలటరీ దుస్తులతో సంతోషంగా కనిపించాడు. ఆ బాలుణ్ణి తీసుకుని ప్రక్కన తల్లిదండ్రులు కాచుకుని ఉన్న మైదానంలోకి తీసుకువెళ్ళాను. కొడుకుని చూచిన వెంటనే

మిగతా 61 వ పేజీలో

## ప్రపంచంలో అతి పెద్ద 'స్టార్ రూబీ'



అమెరికా వాషింగ్టన్‌లోని సోవియన్ యూనివర్సిటీలో ప్రదర్శింపబడిన అమూల్యమైన 'కెంపు' బరువుకంటే 5 రెట్లు ఎక్కువగా తూగే 'స్టార్ రూబీ' కెంపు తన దగ్గర ఉన్నట్లు బెంగుళూరు అడ్వకేటు శ్రీ జి. విద్యారాజ్ అంటున్నారు.

"పలుచని పీచమానవుడు పాటి దలంపక
నిష్ఠురోక్తుం బలుకుచు నుండు."

# నమ్మలేని నిజాలు

## వాషింగ్టన్ వస్తాదు:



జార్జి వాషింగ్టన్ - అమెరికా మొట్ట మొదటి అధ్యక్షుడు గొప్ప వస్తాదు, మరియు లాంగ్ జంపర్ కూడా.

* * *

## 15 సం. ల యువతి బరువు 7.5 కి గ్రా. లు!

చైనాలో ఒక వైద్యుని కుమార్తె జియా జియాన్ ఖ్వాన్ అనే 15 సం ల యువతి ఎత్తు 88 సెం మీలు, బరువు 7 5 కి గ్రా.లు. ఈమె పుట్టినప్పుడు 15 సెం మీ. పొడవుగా ఉండి 250 గ్రా. లు మాత్రమే తూగింది.

## 50% టెలిగ్రాములు పోస్టు ద్వారా పంపబడుతున్నాయి:

మధ్యప్రదేశ్‌లో గత ఒకటిన్నర సంవత్సరాలుగా పంపబడుతున్న టెలిగ్రాములలో సుమారు సగం టెలిగ్రాములు పోస్టు ద్వారా గానీ, వార్తా వాహకుల ద్వారా గానీ గమ్య స్థానాలను చేరుతున్నాయి.

* * *

## బ్రాడ్‌మన్ బాటింగ్:

సుప్రసిద్ధ ఆస్ట్రేలియా క్రికెట్ ఆటగాడు సర్ డొనాల్డ్ బ్రాడ్ మన్ 20 సంవత్సరాలలో ఆడిన 52 టెస్టు పందేలలో బాటింగ్ సరాసరి 99.94 రన్నులు.

* * *

## ప్రపంచంలో పూర్తిగా నల్లజాతి నివసించే పెద్ద దేశం:

పశ్చిమ ఆఫ్రికాలో నైజీరియాకు ముఖ్య

---

## వేలిముద్రలు ముఖ్యంగా మూడే మూడు రకాలు!

వేలిముద్రలు ప్రతిది ముఖ్యంగా వంకీలు (loops), వర్తులాలు (whorls), వంపులు (arches) తో దేనికదే ప్రత్యేకంగా అద్వితీయంగా ఉంటాయి.

"లోకములోన దురనుల లోతు నెరుంగక చేరరాదు సుకోకుడు."

కేంద్రమైన లాగోస్ పూర్తిగా నల్లజాతితోనే నిండిన పెద్ద ప్రదేశం నల్లవారు 10,00,000. మందికి పైబడి ఇక్కడ నివసిస్తున్నారు.

* * *

## "బులీమియా" తిండి రోగం:

బులీమియా ఒక అపూర్వరోగం. ఈ రోగులు రోజుకు 15 గంటలపాటు తింటూనే ఉంటారు.

## సహారా ప్రత్యేక

ప్రపంచంలోగల ఇతర 9 పెద్ద ఎడారుల మొత్తం విస్తీర్ణం కంటే ఆఫ్రికాలో ఉన్న సహారా ఎడారి విస్తీర్ణం ఎక్కువ.

* * *

## వేగంగా పరుగెత్తగల హిప్పోపోటమస్:

మానవునికంటే ఎన్నోరెట్లు అతి స్థూలంగా ఉండే హిప్పోపోటమస్ మానవుని కంటే అతి వేగంగా పరుగెత్తగలదు.

* * *

## నిమ్మరసం పాలు మిశ్రమంతో రహస్య సందేశాలు:

మొట్టమొదట స్వాతంత్ర్య సమరం (1857 సిపాయిల తిరుగుబాటు)లో ఆంగ్లేయులు నిమ్మరసం పాలు కలిపిన మిశ్రమ ద్రవ్యంతో రహస్య సందేశాలు వ్రాసుకునే వారు.

## 2000 లక్షల మంది వామహస్తులు:

ప్రపంచ మంతటా ఇప్పుడు 2000 లక్షల మంది ఎడమచేతులతో తమ పనులు చేసుకునే వారున్నారు. వామహస్తులను ఆంగ్లంలో 'సౌత్ పా' (South paw) అంటారు.

* * *

## ఈగలను తినే తూనీగ:

తూనీగ సాధారణంగా 2 గంటలలో 40 దాకా ఇంటి ఈగలను తినగలదు.

## డినోసరస్ అంతరించడానికి కారణం 'డెత్‌స్టార్'



260 లక్షల సంవత్సరాల కొకసారి తోక చుక్కలను వర్షించే మృత్యుతార (Death Star) ప్రభావంవల్లే భూమిమీద డినోసరస్ అంతరించి ఉండవచ్చని, తిరిగి 150 లక్షల సంవత్సరాల తరువాత భూగ్రహమంతా అతి శీతలమైన అంధకారంలోకి మునిగిపోవచ్చని అమెరికా బెర్కిలీలో కాలిఫోర్నియా యూనివర్సిటీ పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు.

"వెర్రికుండ దొలకుచునుండుగాని మరి దొల్కనె నిండు ఘటంబు."

# షార్కుచేపల సౌమర్థ్యం

ఉష్ణప్రదేశాలలో వెచ్చని సముద్ర జలాలలో నివసించే షార్కు చేపలు చాలా పాయకరమైనవి. ఈ భయంకరమైన చేపలో 25 రకాలు ఉన్నాయి. ఆఫ్రికా దేశా



నికి ఆగ్నేయ తీరప్రాంతం, ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా పసిఫిక్ తీరం, హవాయి ప్రదేశాలలో ఇవి విస్తారంగా ఉంటాయి.

షార్కు చేపలు సాధారణంగా ప్రతిచోటా కనిపించేవే. ఇవి సముద్రపు నీళ్ళలో సుమారు రెండు అడుగుల లోతులలో ఈదుతున్న జంతువులను, మానవులను కూడా చంపుతాయి.

ముఖ్యంగా ఉష్ణ ప్రదేశపు సముద్రాలలో నివసించే పెద్ద తెల్ల షార్కు చేప మిక్కిలి క్రూరమైనది. దీని తరువాత మానవ శరీరాంగాలను దేనికదే కొరికేయగల కత్తివంటి పదునైన పళ్ళు గలది 'టైగర్ షార్కు'. నీటిలో మెల్లిగా సంచరించే జంతువులను వేటాడటానికి ఈ షార్కు చేపలకు నైపుణ్యం ఉంది. దానికి తగిన యాంత్రిక సదుపాయాలు వాటికి ఉందంటారు. నీటిలో ఒక రక్తపు బిందువు కనిపిస్తే చాలు ఇవి పెచ్చురేగి పోతాయి. దారిలో కనిపించిన దేనినైనా ఇవి ఎదుర్కొంటాయి పడవలను అమాంతం పడగొడుతుంటాయి.

సముద్రాలలో నివసిస్తూ మానవులను చంపి తినే వీటికి స్థానిక ఉష్ణప్రదేశాలలో నివసించేవారే తగిన శత్రువులు. కత్తులతో వీటిని సునాయాసంగా చంపుతారు. సాధారణంగా చేపలకు ఉండే చోట గాక షార్కు చేపలకు నోరు కొంచెం క్రింది భాగంలో ఉంటుంది. దీనివల్ల నీటి మట్టంలో జంతువులను వేటాడేటప్పుడు ఇవి పూర్తిగా తలక్రిందుగా తిరగాలి. ఇదే వాటికి ప్రాణాంతకమైన సమయం. షార్కు చేపలను చంపడానికి దగ్గరలో వేచియున్న వేటగాళ్ళకి ఈ చేపల అడుగుభాగం తెల్లగా కనిపిస్తుంది. ఇది అతి మృదువుగా, సుకుమారంగా ఉంటుంది. వెంటనే పొంచి ఉన్న వేటగాళ్ళు కత్తితో దానిని పొడిచి సునాయాసంగా చంపగలుగుతారు.

"ఎంత గొప్పకులంలో పుట్టినా
పూర్వపుణ్య పాప ఫలాలను అనుభవించి తీరాలి."

# ప్రపంచ వార్తలు

## ప్రపంచంలో మొట్టమొదట వ్రాయబడిన భాష:

నేడు ఇరాక్‌లో యూఫ్రటీస్ లోయలోను, దిగువ టైగ్రిస్ నదీ తీరంలోను పూర్వం నివసించిన ప్రాచీన సుమేరియనులు 5,000 సంవత్సరాల క్రితం బంకమట్టి పలకలమీద చెక్కిన వ్రాత ప్రపంచంలో మొట్టమొదటి వ్రాయబడిన భాష. ఇది ఇప్పుడు భాషాంతరీకరణం చేయబడి మొట్టమొదటిసారిగా అమెరికా పెన్సిల్వేనియా యూనివర్సిటీ పండితులు నిఘంటువును తయారుచేస్తున్నారు.

* * *

## భారతీయుల 'జీవనసరళి'85 వ స్థానాన్ని ఆక్రమిస్తోంది:

అమెరికా ఫిలడెల్ఫియాలో పెన్సిల్వేనియా యూనివర్సిటీకి చెందిన సోషల్ వర్క్ ప్రొఫెసర్ డా. రిచర్డ్స్ ఎస్టేట్స్ 107 దేశాలలో 'జీవనసరళి' (quality of life) అధ్యయనం ప్రకారం ప్రపంచంలో భారత దేశం 85 వ స్థానాన్ని, పాకిస్థాన్ 101 వ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. వీరి జాబితాలో అమెరికాది 41 వ స్థానం మొదటి పది స్థానాలు వరుసగా డెన్మార్క్, నార్వే, ఆస్ట్రియా, నెదర్‌లాండ్స్, స్వీడెన్, లాండ్, ఆస్ట్రేలియా, ఐర్లాండ్, బెల్జియం మరియు ఫిన్‌లాండ్‌లు ఆక్రమించాయి.

* * *

## అపరిమితమైన ఉత్పత్తి:

ఒకే ఒక గులాబీ పొదనుంచి సంవత్సరానికి 2,00,000 మొదలు 4,00,000 మొక్కలు పుట్టుకువస్తాయి. ఫ్రెంచి నేషనల్ అగ్రోనామిక్ పరిశోధక సంస్థలో టెస్ట్‌ట్యూబ్‌లో అభివృద్ధిపరచిన మొక్కల ప్రవృద్ధి విధానం వల్ల ఇకమీదట మొక్కల ఉత్పత్తి పరిమితి లేకుండా అనంతంగా పెరగడానికి సాధ్యపడుతుంది.

## ఆ ట క్మ ంజీవి!



ఎనిమిది భుజాల అతిభయంకరమైన సముద్రజంతువు ఆక్టోపస్ దానిని అదే భక్షిస్తున్నట్టు కొంతమంది చూశారు. ఒక ఆక్టోపస్ దాని 6 చేతులు అమాంతం తినేసి చివరికి మరణించింది.

"దానబుద్ధి, సత్యవాక్కు, అహింస ప్రియవాక్కు అభ్యసింపదగిన నాలుగు సద్గుణాలు."

## సౌరశక్తితో పెద్ద డిసెలైనేషన్ ప్లాంట్:

సౌరశక్తి వినియోగంతో ఉప్పునీటిని శుభ్రపరచే ప్రపంచపు పెద్ద డిసెలైనేషన్ ప్లాంట్ జపానువారి సానుభూతితో అబుధాబీలో నిర్మింపబడుతుంది. దీని నిర్మాణం పూర్తికావడానికి 750 లక్షల రూపాయలు వ్యయమవుతుంది.

* * *

## ఆసియా జనాభా 26,000 లక్షలు:

ఆసియాదేశపు జనాభా సాలీనా 1.8 శాతం పెరుగుతూంది. ఈ విధంగా పెరుగుదల అభివృద్ధి అవుతూంటే వచ్చే 26 సం. రాలలో జనాభా రెట్టింపు అయిపోతుంది అని ఫిలిప్పైన్ యూనివర్శిటీ పాప్యులేషన్ ఇన్‌స్టిట్యూట్ డెమోగ్రాఫర్ డా. లిటాడొమింగో అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. 1981 వ సంవత్సరాంతానికి జనాభా 26,000 లక్షలని గుర్తింపబడింది.

## 500 మీటర్ల పొడవైన కాలువ కొన్నే సెకండ్లలో నిర్మించారు:

కేవలం కొన్ని సెకండ్ల కాలంలోనే 2700 టన్నుల ప్రేలుడు మందులతో 500 మీటర్ల పొడవైన కాలువను సిద్ధం చేసారు. సామాన్యంగా ఈ పనికి ఒకటిన్నర సంవత్సరం కాలం పడుతుంది. ఉజ్‌బెకిస్తాన్, టుర్క్మేనియా సరిహద్దులలో నిర్మింపబడిన టుయా-ముయున్ రిజర్వాయరులకి అమూదర్యా నదీజలాలు ఈ కాలువద్వారా ప్రవహిస్తాయి.

* * *

## 100 సంవత్సరాలపాటు చెక్కు చెదరని కలర్ ప్రింట్ కాగితం:

ఈ మధ్య అమెరికాలో 100 సంవత్సరాల దాకా చెక్కు చెదరని ఫొటోగ్రాఫిక్ కలర్‌ప్రింటు కాగితం ప్రవేశపెట్టబడింది. 24° సెంటీగ్రేడు ఉష్ణోగ్రత, వాతావరణంలో 60 శాతం తేమ, సాధారణ కాంతి ప్రసారం గల పరిస్థితులు దీనికి అనుకూలం.

(మిగతా 62 వ పేజీలో)

## భగవద్గీతామృతం



"గీతను గురించి యోచించిన కొద్దీ అందులో లభించే విజ్ఞానసారం అమూల్యమైనదనీ, అది ఒక అపూర్వ సమయంలో అసాధారణ పరిస్థితుల్లో విశిష్ట మానసిక పరిణామంలో ఉల్లేఖించబడి ఉండాలని తోస్తుంది. ప్రతీ రోజూ నేను ఉదయం భగవద్గీతామృతంలో విజ్ఞాన స్నానం చేస్తాను."—థోరో

"తమ తమ నెలవులు తప్పిన తమ మిత్రులు శత్రువులౌట తథ్యము."

# నవభారత నిర్మాతలు

## తాత్యా తోపే

యు. సుబ్రమణియమ్

**1857** స్వాతంత్ర్య సమరం (సిపాయీల తిరుగుబాటు)లో ముఖ్యంగా పేర్కొనదగినవారు ఇద్దరు - ఝాన్సీరాణి,

TATYA TOPE

త్యాతోపే. సహజంగా స్త్రీ అవడంచేత, అపూర్వ ధైర్యసాహసాలను ప్రదర్శించడం వల్ల ఝాన్సీని ఎవ్వరూ మరువలేరు. కాని తాత్యాతోపే చరిత్ర చాలామందికి తెలిసి ఉండదు. పీష్వాలలో చివరి పీష్వాదగ్గర చిన్న గుమాస్తాగిరిలో ఉండి సైన్యాధిపతి పదవికి వచ్చిన తంత్రజ్ఞుడు తాత్యాతోపే ఆంగ్లేయ సైనికులకు అతి సులభంగా లొంగిపోకుండా వారికి అనేక కష్టాలు కలిగించి వారితో దీర్ఘకాలం పోరాడిన మేధావి. దేశాభిమాని.

"సిపాయీల తిరుగుబాటులో అఖండ ప్రజ్ఞావంతుడు" అని ఒక ఆంగ్లేయ చరిత్రకారుడు తాత్యాతోపేని గురించి చెప్పాడు. "ప్రపంచంలో గొరిల్లా నాయకులలో ఎక్కువ ప్రసిద్ధి పొందాడు" అని కూడా వివరించబడ్డాడు.

### దేశానికి నిజమైన విరోధులు

బాగా డబ్బును కూడబెట్టుకునే రాజకీయ తంత్రజ్ఞులే దేశానికి నిజమైన విరోధులు. ప్రతి భారతీయుడు సత్యం, న్యాయం, క్రమశిక్షణ అనే మూడు గుణాలను అలవరచుకోవాలి.

—జనరల్ కె. ఎమ్. కరియప్ప,
ప్రప్రథమ ఇండియన్ ఆర్మీ కమేండర్
ఇన్ చీఫ్.

"సహనం నుంచి లభించే ఫలాలు మధురంగా ఉంటాయి." - గాంధీజీ

తాత్యాతోపీ నాశిక్ ప్రాంతంలో పటోడా ...లో ఈవొలే (Yeawale) అనే ...మంలో 1813-14 సం. లో జన్మించాడు. ...స్థ బ్రాహ్మణుడు. తాత్యా అనేది ...తాశికి పెట్టిన పేరు ఇతడి అసలు పేరు ...మచంద్ర పాండురంగ ఈవొలెకార్. ఇతడి ...త్మబుద్ధికి నైపుణ్యానికి. కార్యదక్షతకు ...మ్చుకుని పీష్వా నవరత్నాలు పొదిగిన ఒక ...పీని ఇతడికి సన్మానించాడు. అప్పటి ...ంచి ఇతనిని తాత్యాతోపీ అని పిలువ ...గారు.

తాత్యా తండ్రి ఒక పూజారి. పీష్వా ...ంశానికి చెందిన రెండవ బాజీరావు హయా ...ంలో ఇతడు రాజకీయ ఉద్యోగిగా నియ ...ంపబడ్డాడు. 18·8 వ సం. లో ఆంగ్లే ...యులు పీష్వాను ఓడించారు. పీష్వాకు ...గా సామ్రాజ్యం దక్కలేదు. ఆంగ్లేయులు ...పీష్వాను అప్పుడు ఉత్తరప్రదేశ్ కాన్పూర్ ...దగ్గర బిదూర్ పట్టణానికి పంపి కొంత ఉప ...కార వేతనం ముట్టజెప్పేవారు. పీష్వా పెంచు ...కున్న ముగ్గురి కుమారులతోపాటు తాత్యా ...సమానంగా పెరుగుతూ వచ్చాడు. పీష్వా మొదటి కొడుకే నానాసాహేబు. పీష్వా తరువాత రాజ్యాధికారాన్ని స్వీకరించవలసిన వారసుడు. వీరందరికీ సైనికశిక్షణ ఇవ్వబడింది. గత వైభవాన్ని కూడా వీరు నలుగురూ పంచుకున్నారు. తాత్యా నానాసాహేబుకి ఆంతరంగిక సైనికుడుగా ఉండేవాడు.

తండ్రి తరువాత తండ్రి స్థానాన్ని అధిష్ఠించిన నానాసాహేబును ఆంగ్లేయులు అనేక తిప్పలు పెట్టారు. తండ్రి కిచ్చిన రాజమర్యాదలు ఇతడికి దక్కించలేదు. తండ్రి కిచ్చే ఉపకార వేతనం ముట్టచేయలేదు. రాజ ముద్రను ఉపయోగించుకోవడానికి వీలు లేకుండా చేసారు. ఆంగ్లేయులు ఎవ్వరూ ఇతడికి మర్యాద చూపనక్కర్లేదని, నమస్కారం

## దుఃఖరోగ నివారిణి



మానవులు తమ దుఃఖాలను నివారించుకుని పరమాత్మని యందు అకుంఠిత విశ్వాసాన్ని పెంపొందించుకోడానికి దివ్యౌషధం 'కరుణ'. దుఃఖ నివారణకు 'సహనం' అనేదే దివ్యౌషధమైన కరుణ భక్తి ఒక్కటే దుఃఖాలను ఓర్చుకోడానికి తగిన శక్తిని ఇస్తుంది. అందుచేతనే ప్రతీ చోటా దేవాలయాలు ఉండాలి. ఈ దేవాలయాలలో దేవతామూర్తులకు ఘనం అర్పించే 'పువ్వులు' నైవేద్యాలు, భక్తిపూర్వకమైన కానుకలు.

—కంచి పరమాచార్య.

"మంచి చెడ్డలు తెలియనివారి ముందు ప్రాజ్ఞునికి మౌనం మేలు."

చేయకూడదని శాపించారు. నానాసాహెబుకి ఇతడి సైన్య సలహాదారుడుగా చేరిన తాత్యాకి కూడా ఇది చాలా అవమానకరం అనిపించింది.



ఉంది. ఇద్దరు తగిన సమయం కోసం వేచి ఉన్నారు. ఇంతలో దగ్గరలో ఉన్న కాన్పూర్‌లో తిరుగుబాటు ప్రారంభమైంది. ఈ తిరుగుబాటుదారులతో చేరి ఆంగ్లేయులను కాన్పూరునుంచి వెడలగొట్టారు. కాని ఆంగ్లేయులు పోరాడి కాన్పూరుని తిరిగి పట్టుకోడమే కాకుండా బిఠూరునుంచి నానాసాహెబునూ, తాత్యానూ వెడలగొట్టారు. బిఠూరు యుద్ధంలో హేవెలక్ గెలిచాడు. నానా తాత్యాను సైన్యాధికారిగా చేసాడు. ఇప్పుడు యుద్ధభాగం అంతా తాత్యామీద పడింది.

ఆంగ్లేయులు కాన్పూరును తిరిగి స్వాధీనం చేసుకున్న తరువాత తాత్యా స్థానికంగా వివిధ రాజ్యాలకు చెందిన సైన్యాధికారులతో సంప్రదింపులు జరిపి తనతో చేర్చుకున్నాడు. గ్వాలియరు పటాలాన్ని చేరదీసి యుద్ధం చేసి కాన్పూరులో జనరల్ విండ్‌హామ్‌ను వెనక్కు తరిమారు. కాని ఇంతలో సర్ జాన్ క్యాంబెల్ వీరిని ఓడించాడు. ఝాన్సీ ఆంగ్లేయ సైనికులకు చిక్కింది. తాత్యా సుమారు 20 000 మంది సైనికులను కూడ తీసుకుని రాణీ లక్ష్మీబాయిని రక్షించడానికి ప్రయత్నించాడు. కానీ సర్ హ్యూగ్ రోజ్ వీళ్ళను చెదరగొట్టాడు. తరువాత తాత్యా సింధియా సహాయంతో గ్వాలియర్ కోటను ముట్టడించాడు. కాని లాభం లేకపోయింది. సర్ హ్యూగ్ రోజ్ తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. ఝాన్సీరాణి యుద్ధంలో మరణించిన తరువాత తాత్యాను జనరల్ నేపియర్ సైన్యం ఓడించింది. సైన్యం చెల్లాచెదరు అయిపోయింది.

ఝాన్సీరాణి మరణించింది. కోటలు, దుర్గాలు శత్రువుల వశం అయిపోయాయి. తాత్యా శత్రువుల బారినుండి తప్పించుకుని పారిపోయాడు. మంచి ధైర్యసాహసాలు కలవాడు, వివేకవంతుడు అయిన తాత్యాకి గొరిల్లా ఎత్తులు సహజంగా అబ్బాయి. ఆంగ్లేయులకు సులభంగా చిక్కలేదు. ఆంగ్లేయ ప్రభుత్వంలో పెద్దపెద్ద సైనికాధికారులకు చిక్కకుండా 10 నెలలపాటు వారిని వేధించాడు. మధ్య ఇండియా ముఖ్య

## ప్రపంచంలో మొట్టమొదటి నాస్తిక రాష్ట్రం

యూరప్‌లో 25 లక్షల జనాభాగల చిన్న దేశం - అల్బేనియా ప్రపంచంలో మొట్టమొదటి నాస్తిక ప్రదేశం. ఇక్కడుండే ప్రతీ చర్చి మసీదు మ్యూజియంలుగాను, ఆటప్రదేశాలుగాను మార్చబడ్డాయి.

“ప్రీతి గలిగేటట్లు మాట్లాడితే అదే స్వర్గానికి సోపానం.”

ద్రంగా పెట్టుకుని తాత్యా తన గొరిల్లా ద్ధక్రమాలు కొనసాగించేవాడు. చంబల్ యలో దోబూచులు సాగించాడు. పొంగి రలుతూన్న నర్మదానదిని దాటి ఆంగ్లేయ నికుల యుద్ధ సామగ్రులను రహస్యంగా యోగించేవాడు. ఆంగ్లేయ సేనాధిపతులు నిని పట్టుకోడానికి పోటీలు పడేవారు.

చిట్టచివరకు మాయోపాయంచేత ఆంగ్లే లు అతడిని పట్టుకోగలిగారు. అతని హితుడైన మాన్‌సింగ్ సహాయంతో క్యాప్టెన్ మీడే (Captain Meade) పారాన్ (paron) అడవులలో తాత్యాను చేజిక్కించుకున్నాడు. ప్రభుత్వంవారిపై దాడిచేసినందుకు తాత్యాతోపే శిక్షింపబడ్డాడు. ఏప్రిల్ 18, 1859 న షివ్‌పురి (Shivpuri) కవాతు మైదానంలో ఉరితీయబడ్డాడు.

1857 వ సం. పు తిరుగుబాటులో ముఖ్యమైన సేనానాయకులలో తాత్యాతోపే ఒకడు. తాత్యాతోపే జీవితం ప్రజాహృదయంలో దేశభక్తిని పురికొల్పింది.

# భయపడ వద్దు!



ఎన్నిసార్లు భయంకరమైన మరణావస్థను ొందానో. ఆకలితో మలమల మాడుతూ ళ్ళు కాయలు కాచి అలసిపోయి ఒకరోజా, ెండురోజులా, 'ఎన్ని రోజులో తిండిలేక, ాలు ఎత్తి పాదం పెట్టలేక ఒక చెట్టుక్రింద తికిలపడ్డాను. నోటంట మాట రావడం ేదు. మనస్సులో యోచనలేదు నాకు భయం ేదు, చావులేదు, ఆకలిలేదు, దాహం లేదు. అదే నేను. ప్రకృతి నన్ను నశింపజేయలేదు.

"ప్రకృతి నీ చేతిలో ఉంది. నీ శక్తిని ప్రభవించుకో. దేవాధి దేవతవు నీవే! పోయిన సామ్రాజ్యాన్ని గెలుచుకో! లే బయలుదేరు! ఆగవద్దు!" అనే ప్రబోధం కలిగింది. నవచైతన్యంతో లేవగలిగాను. కష్టాలు సంభవించినప్పుడు వాస్తవాన్ని ధైర్యంగా ఎదుర్కో. చీకట్లు పటాపంచలౌతాయి. ఆహా! ఇదంతా ఒక స్వప్నమే కదా! కష్టాలు కొండలలాగా కనిపిస్తాయి. భయంకరంగా ఉంటాయి. చీకటి అంధకారంగా కమ్ముకోవచ్చు. ఇదంతా మాయ. భయపడవద్దు. ధైర్యంగా ఎదుర్కొంటే పారిపోతాయి. అణగద్రొక్కితే మటుమాయమౌతాయి. ఎన్నిసార్లు అపజయం పొందానో అని ఆలోచించకు. నిర్భయంగా ఉండు. కాలం అనంతం. ముందుకి అడుగువేయి. నీ వ్యక్తిత్వాన్ని ప్రభావించుకో!"

—స్వామి వివేకానంద

"....మానవుల తిక్కకు వేరొక మందుగల్గునా!"

# గృహ వైద్యము

ఎన్. బాలసుబ్రమణియమ్

ప్రాచీన కాలంనుంచీ సాంప్రదాయికంగా ప్రతీ కుటుంబంలోను సామాన్య రోగా



లకు వాడే ఇంటిమందులు ఎన్నో ఉన్నాయి. సాధారణంగా మంచి అనుభవం ఉన్న వృద్ధులు, తల్లిదండ్రులు అవసరమైనప్పుడు తమ పిల్లలకు వీటిని చెబుతూ ఉంటారు. సులభంగా ప్రతీచోటా దొరికే పళ్ళు, కాయలు, ఆకులు, వేళ్ళు, పువ్వులు, విత్తనాలు, నూనెలు మొదలైనవాటిని చాలామంది రోగ నివృత్తికి ఆరోగ్యాభివృద్ధికి వాడుతూంటారు.

కడుపునొప్పి, తలనొప్పి, కడుపులో త్రిప్పు, కాళ్ళుచేతులు నొప్పులు, దురదలు, కురుపులు మొదలైనవి సామాన్య రోగాలు. ప్రతీ ఇంట్లోను ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు ఇటువంటి రోగాలతో బాధపడుతూంటారు. ఇటువంటి సామాన్య రోగాలకు అమోఘమైన దివ్యఔషధ సామగ్రి మన ఇంట్లోనే కావలసినంత ఉంటుంది ఆవాలు, ధనియాలు, వాము, జీలకర్ర వంటి పోపుల సామానులు; మిరియాలు, శొంఠి, అల్లం, ఏలక్కాయలు, లవంగాలు వంటి సుగంధ ద్రవ్యాలు; కొత్తిమిరి, పుదీనా, కరివేపాకు వంటి పరిమళవర్ధకాలు వివిధ రోగాలకు వాడుతుంటారు. తమలపాకులు మందుగా లోపలకు తీసుకుంటారు. తాంబూలంగా వాడుతారు. పైన కట్లకు కూడా వాడతారు. నువ్వుల నూనె, కొబ్బరి నూనె, వేప నూనె, ఇప్పనూనె మొదలైన వివిధ రకాల నూనెలు కూడా కొన్ని రోగాలకు ఉపయోగపడతాయి. అనేక సామాన్య రోగాలకు తక్కువ ఖర్చుతో

---

## జపానీయుల ఆయువు అధికం

ప్రపంచంలో జపాను దేశస్థులు అందరికంటె దీర్ఘకాలం జీవిస్తారు అధికార రీత్యా జరిపిన పర్యవేక్షణ ప్రకారం ప్రస్తుతం జపానులో పురుషుల సగటు ఆయుః ప్రమాణం 74.20 సం॥ లు: స్త్రీలది 79.78 సం॥ లు. ఐస్‌లాండ్ పురుషుల ఆయుః ప్రమాణం 73.91 సం॥లు. స్త్రీలది 79.45 సం॥ లు.

"దేహబలం గలవానికంటె నీతి బలము గలవాడు ఘనుడు."

గువ వ్యయప్రయాసలు లేకుండా అత్య
ఫలితాన్ని పొందగల కొన్ని సామాన్య
షధయోగాలు ఇక్కడ వివరింపబడ్డాయి.



కడుపునొప్పి, కడుపు ఉబ్బరం, అజీర్ణ
రోగాలకు అతిసులభంగా ఇంట్లో అనువుగా
సుకోగలిగిన మందు — చిన్న ఇంగువ
ముక్క, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, వేప
పువ్వు, వాము, జీలకర్ర అన్నీ సమభాగాలు
సుకొని కొద్దిగా వేయించి సైంధవలవణం
కేర్చి పొడిచేసి ఒక చెంచాడు పొడి మొదటి
అన్నంలో నేతితో కలుపుకుని తింటే అన్ని
విధాల అజీర్ణరోగాలు, కడుపు ఉబ్బరం ఇట్టే
తగ్గిపోతాయి. ఈ పొడి చాలాకాలం నిలువ
ఉంటుంది. అవసరమైనప్పుడు వాడుతూండ
వచ్చు. ప్రసవానంతరం స్త్రీలకు మంచి
ఔషధం ఇది; జీర్ణకారి కూడా.

ధనియాలు, జీలకర్ర సమభాగాలు తీసు
కుని కషాయం కాచి తీసుకుంటే కడుపులో
నొప్పి వెంటనే తగ్గుతుంది. అరచెంచా
వాము, ఒక తమలపాకు, కొంచెం ఉప్పు
చేర్చి నోట్లో నములుతూ రసం మ్రింగితే
ఎంత విపరీతమైన కడుపు శూలైనా నిమి
షాలమీద తగ్గిపోతుంది. వాము బదులు జీల
కర్ర వాడవచ్చు. ఎటువంటి తలనొప్పి
అయినాసరే ఏ మాత్రలు అక్కరలేదు. 10
మిరియాలు మెత్తగా ముద్దనూరి వేడి చేసి
వేడి వేడిగా నుదుటిమీద పట్టు వేసుకుంటే
జలుబు, తలనొప్పి తగ్గిపోతుంది. ఇంట్లో
పొడి వాడుకోవచ్చు. తలనొప్పులకు మిరి
యాలకు బదులు శొంఠిపట్టు కూడా వేయ
వచ్చు.

శొంఠి పొడి, బెల్లం కలిపి పరగడుపున
తింటే మంచి ఆకలి పుడుతుంది. దీనినే
భోజనం తరువాత తింటే కడుపులో గాలి
చేరనీయకుండా మంచి జీర్ణకారిగా ఉపయోగ
పడుతుంది.

## ప్రతీ మానవసంఘం మూడు సూత్రాలకు లోబడి ఉంటుంది

ప్రతీ మానవ సంఘం కూడా మూడు
సిద్ధాంతాలకు లోబడి ఉంటుంది 1. ఎప్
స్టీన్స్ సిద్ధాంతము: దీని ప్రకారం అతి
తక్కువ శ్రమతో చాలామంది తమ తమ
అవసరాలను, కోరికలను సిద్ధింప జేసు
కుంటారు. 2. గ్రెషామ్స్ సిద్ధాంతం: దీని
ప్రకారం ఆదర్శవాదుల స్థానాలలో అవకాశ
వాదులు చోటు చేసుకోవడం; 3 డిమిని
షింగ్ రిటరన్స్ సిద్ధాంతం: అధికాధిక
సమయ సామర్థ్యాల వినియోగంతో అత్యల్ప
ఫలితాలను పొందడం.

—ఎ. జె. నాగ్

"కోరనివాడే యోగి, ఇది కొమ్మని ఇచ్చినవాడే త్యాగి."

శొంఠి, ఆవాలు మెత్తగా నూరి మోకాళ్ళకు, మణాలకు పట్టువేస్తే కీళ్ళ నొప్పులు, నరాల బిగి తగ్గిపోతాయి. మలబద్ధతకు రాత్రి



పడుకునే ముందు ఒక చెంచాడు ఆముదం పాలలో గిలకరించి పుచ్చుకుంటే పొద్దున్నే సాఫీగా విరేచనం అవుతుంది. మరో సులభ వైద్యం - రాత్రి పడుకునే ముందు బాగా పండిన అమృతపాణి అరటిపండు చిన్న చిన్న చక్రాల లాగా తరిగి ఆముదంలో ముంచి 5 లేక 6 ముక్కలు నమలకుండా మ్రింగినా చాలు మలబద్ధకం పోతుంది.

ఏలకులు, దాల్చిన చెక్క, పటిక బెల్లం బాగా మెత్తగా పొడిచేసి నేతిలో కలుపుకుని చిన్న చిన్న మాత్రలు చేసి తీసుకుంటే ఆమశంక (జిగట విరేచనాలు)ను అతి సులభంగా నివారించుకోవచ్చు. పటిక బెల్లం, నెయ్యి ముద్దగా చేసి రోజుకి రెండు మూడు సార్లు తీసుకున్నా ఆమశంక తగ్గిపోతుంది.

మెత్తటి పసుపును ముదగా ఉడికించి వేడి వేడిగా కురుపులకు పట్టిస్తారు. చర్మం పగుళ్ళకు, కాలిపగుళ్ళకు, పుళ్ళకు, పసుపు ముద్ద (చల్లగా) పట్టించవచ్చు. పెద్ద పెద్ద రక్తపు గడ్డలకు వేడిగా ఉన్న పసుపు ముద్ద పట్టించి పైన తమలపాకుతో కట్టవచ్చు. తమలపాకుకు ఆముదం పట్టించి రక్తపుగడ్డల మీద వేస్తే పోటు తగ్గిపోతుంది. వాపు తీస్తుంది. శీఘ్రంగా మొన తేలుతుంది.

గొంతునొప్పి, దగ్గు, నోటి పుండు మొదలైన వాటికి వేడి వేడి పాలలో కొద్దిగా పసుపు, మిరియాల పొడి కలిపి త్రాగాలి. అల్లం, ధనియాలు మెత్తగా రుబ్బి రసం తీసి దాంట్లో నిమ్మరసం పట్టుతేనె చేర్చి తీసుకుంటే పైత్యహారి. తల త్రిప్పు తగ్గిపోతుంది. గ్రామాలలో, మూర్ఛరోగాలకు ఆయుర్వేద వైద్యులు నువ్వుల నూనెను రోగుల పాదాలకు మర్దన చేస్తారు. నోటి పుళ్ళకు కొబ్బరినూనె దివ్య ఔషధం. వేపాకు పసుపు నూరి కొబ్బరినూనె కలిపి ఒంటికి

## ప్రాణాన్ని కాపాడే ఆభరణాలు

అమెరికాలో ప్రాణాలను రక్షించే ఆభరణాలు క్రొత్తగా అమ్మకానికి వచ్చాయి. శరీరంలో నాడి సరిగ్గా కొట్టుకోనప్పుడు వెంటనే చేతికున్న కడియం కాంతిపుంజాలను ప్రసరిస్తుంది. వాతావరణంలో సల్ఫర్ డయాక్సైడ్ శాతం అధికమై ఉక్కిరిబిక్కిరి అయిపోతుంటే మెడలో ధరించిన గొలుసులోని పతకం మెరవడం ప్రారంభిస్తుంది. గుండె వేగంగా కొట్టుకుంటూ ఉంటే మెడలో లాకెట్ ధగధగలాడుతుంది.

"తనకు తాను లోబడినవాడు బద్ధజీవుడు,
తనను తాను లోబరచుకున్నవాడు గుణాతీతుడు."

ట్టిస్తే అన్నిరకాల దురదలు తగ్గుతాయి.

నువ్వుల నూనె కూడా కొబ్బరి నూనె గాగే నోటి పుళ్ళకు ఉపయోగించవచ్చు.



సాధారణంగా పొద్దున్నే చద్ది అన్నం లేక తరువాణితో నువ్వుల నూనె. కొద్దిగా నీరుల్లి పాయి తింటే శరీరంలో తాపాన్ని తగ్గించి బాగా చలవచేస్తుంది. మంచి పుష్టిని కలిగిస్తుంది.

కడుపులో నులిపురుగుల వల్ల చాలామంది బాధపడుతుంటారు. వేపచిగుళ్ళు, మిరియాలు ముద్దగా నూరి చిన్న గోళీలంత మాత్రలు రెండేసి పరగడుపున తీసుకుంటే నులి పురుగు, ఇతర జంతువులు కడుపులో చేరవు.

పచ్చ కామెరలు ముదరకుండా ఉంటే ఇంటి మందులతో నిరోధించుకోవచ్చు గుంటగలగరాకు, మిరియాలు మెత్తగా నూరి చిన్న చిన్న మాత్రలుగాచేసి నీడను ఆరబెట్టి పూటకు ఒక్కొక్క మాత్ర తీసుకుంటూ పథ్యంగా ఉంటే కామెర్లు తగ్గిపోతాయి. ఇంతకంటె సులభంగా తుప్పమణి (మూర్కాండ) ఆకురసం గాని, నేల ఉసిరిగ మొక్కల రసంగాని ఒక చెంచాడు పెరుగులో కలిపి తీసుకున్నా కామెర్లు తగ్గిపోతాయి. ఈ రోగానికి చాలా ముఖ్యం.

ఇవి ఏవీ కూడా చెరుపు చేయవు, వికటించవు ఇవి పుచ్చుకోడంవల్ల ఇతరబాధలు పొడసూపవు. నిరపాయకరమైనవి. పిల్లలు, పెద్దలు ఇంట్లో అందరూ నిర్భయంగా ఉపయోగించవచ్చు. ఆయుర్వేద వైద్యులు ముఖ్యంగా వాడే చిట్కాలే ఇవి.

## ఎందుకు?

### ప్రకృతిలో హరితవర్ణమే ఎందుకు ఎక్కువ?

సూర్యరశ్మి సహాయంతో గాలిలోనూ, నీటిలోనూ లభ్యమయ్యే కార్బన్ డయాక్సైడ్‌ను ఉపయోగించి పిండి పదార్థాన్ని (Starch) తయారు చేసుకోడానికి సంక్లిష్టమైన హరిత పదార్థం (Chlorophyll) చెట్లకు, మొక్కలకు మిక్కిలి అవసరం. కాబట్టి ఈ ఆకుపచ్చని హరిత పదార్థం పెరిగే మొక్కలలో అధికంగా ఉంటుంది. ఇది కర్బనము (Carbon), ఉదజని, ప్రాణ వాయువు మరియు మెగ్నీషియముల ప్రాతిపదిక మిశ్రమం.

**"మానవుని వాంఛలకు అనుకూల పరిస్థితులే సుఖాలు, ప్రతికూల పరిస్థితులే కష్టాలు."**

# స్నానం చరిత్ర

రాఘవేంద్రరావు

"స్నానం కంటే గొప్పది లేదు" అన్నాడు సుప్రసిద్ధ గ్రీక్ వైద్యుడు హిపోక్రటీస్. నేటి నాగరీక ప్రపంచంలో మనిషి నిత్య స్నానం ఒక ప్రధానమైన అంశం. భారతదేశంలో దేవతార్చనలో 'స్నానం' ఒక భాగం. దేవుణ్ణి పూజించే ముందు విధిగా స్నానం చెయ్యాలి. పరమాత్మ స్మరణచేసి తీర్థాభిమాన దేవతలను ప్రార్థించి మృత్తికాస్నానం, అఘమర్షణ స్నానం, మంత్ర స్నానం, ధ్యాన స్నానం, ఉష్ణోదక స్నానం అనేవి మనకు నిర్ణయింపబడ్డాయి. ఈ నాడు కొందరు వైద్యుల అభిప్రాయంలో చర్మసౌందర్యం పెంచుకోడానికి, శరీరాన్ని ఆరోగ్యవంతంగా ఉంచుకోడానికి ఆవిరి స్నానం, మట్టి స్నానం, ఆతప స్నానం మొదలైనవి ప్రశస్తమైనవి

ప్రతి హైందవుడు నిత్యం ఆచరించే కర్మలలో స్నానం ఒకటి అయినా హిందువులు అందరూ ప్రతీ రోజూ స్నానం చేయరు కాశ్మీరు దేశంలో లడక్ జిల్లాలో మారుమూలల. దీనికి చేరువగానే చుంగ్ తుంగ్‌లో నూ నివసించే 16 000 మందికి అనేక శతాబ్దాల నుండి అసలు స్నానం అంటే ఏమిటో తెలియదు. వారి వంశాలలో వారి పూర్వీకులు, తాతలు, తండ్రులు కూడా స్నానం చేసి ఎరగరు.

చుంగ్‌తుంగ్‌లోని ప్రజలలాగే బర్మాలో కూడా కాచిన్ (kachin) తెగకు చెందిన

## క్యాన్సర్ నిరోధక శక్తిగల ఎర్ర జిన్సెంగ్ ఓషధి



ఎర్ర జిన్సింగ్ మొక్కలో (red ginsing plant) క్యాన్సర్ నిరోధక శక్తి బ్రహ్మాండంగా ఉందని జపానులో కన్‌జావా యూనివర్సిటీకి చెందిన ఒక పరిశోధక బృందం తెలుసుకున్నారు ఎలుకల క్యాన్సర్ కణాల మీదికి 'జిన్‌సెనోసైడ్' ఇంజక్షన్ చేస్తే ఒక్క రోజులో క్యాన్సర్ కణాల అభివృద్ధి నిలిచిపోయింది.

"మేలు చేసినవానికి మేలు చేయుట కాదు:
కీడు చేసినవానికి మేలు చేయుట మంచి కార్యము."

జాతికి స్నానం అంటే తెలియదు. ఈ జాతి వారు స్నానం చేయడం అంటేనే చాలా ఏవగించుకుంటారు. కాచిన్ జాతివారు వారి జీవితంలో ముఖ్యంగా మూడుసార్లే స్నానం చేస్తారు. పుట్టినప్పుడు, పెళ్ళి చేసుకునేప్పుడు, మరణించినప్పుడు. ఇది అనాగరికము, అసభ్యము అని అనుకోనక్కర్లేదు. మంచి సంస్కారవంతులు, నాగరికులు అనుకునే వారికి కూడా నిత్యస్నానం నిత్యధర్మం కాదు.

జపాను దేశంలో ఇప్పటికీ వాళ్ళ ఇళ్లల్లో స్నానపు గదులు, స్నానపు వసారాలు ఉండనే ఉండవు ఎవరైనా స్నానం చేయాలి అని అనుకుంటే సాధారణంగా వారానికి రెండు - మూడుసార్లు, దేశంలో ప్రత్యేకంగా ఏర్పాటైన స్నానశాలలు లేక మజ్జన శాలలకు వెడతారు. ఈ మజ్జనశాలల్లో నామ మాత్రం కొంచెం డబ్బు చెల్లిస్తే ఒళ్ళు బాగా రుద్ది నీళ్ళు పోస్తారు. ఈ విషయంలో ఫ్రెంచి వారి అలవాటు ఇంకా అధ్వాన్నంగా ఉంటుంది. పారిస్‌లో ప్రతి నలుగురిలో ఒక్కరు మాత్రమే నిత్యస్నానం గానీ షవర్ బాత్ గానీ చేస్తారని ఇటీవల పరిశోధన వల్ల తెలిసివచ్చింది ఫ్రెంచివారికి సదుపాయాలు, అనుకూలాలు, అవకాశాలు లేవని కాదు. సుమారు 85 శాతం పైబడిన ఫ్రెంచివారందరికీ ఇళ్ళల్లో స్నానపు గదులున్నాయి. స్నానపు గదులను ఉపయోగించడానికి ఇష్టపడరు, అంటే ఇప్పుడు మీకు అర్థమవుతుంది ఫ్రెంచిదేశం అత్తరువులకు ఎందుకు ప్రసిద్ధో!

భారతదేశంలో స్నానం నిత్యధర్మంగా పరిణమించిందంటే అప్పటి ప్రత్యేక ఉష్ణ వాతావరణమే ముఖ్య కారణం. దేశంలో చలి ఆధిక్యతనుబట్టి, శీతల వాతావరణాన్ని బట్టి స్నానాల అవసరం తగ్గుతూంటుంది. మనదేశం వంటి ఉష్ణప్రదేశాలలో శరీరానికి పట్టే చెమట, మట్టి కడుక్కొని స్నానం చేయడం కంటే హాయి మరొకటి లేదు.

మన దేశంలో స్నానం అనాది నుంచీ ఉందంటే ఆశ్చర్యపడక్కర్లేదు నదీ తీర ప్రదేశాలలో, గ్రామాలలో జనం ప్రొద్దున్నే నదులలోను, కాలువలలోను స్నానం

## ప్లాటినం పోగుల కిమోనో



ప్లాటినం పోగులతో బ్రహ్మాండంగా తయారుచేసిన కిమోనో ఇప్పుడు టోకియో (జపాను)లో డిపార్ట్‌మెంటల్ స్టోరు నగల విభాగంలో ప్రదర్శింపబడుతూంది. దీని విలువ 11.5 లక్షల డాలర్లు.

"కాయము వంచి యింటిపనికై శ్రమచేయుట తప్పుగాదు."

చేయడం మనం అందరం చూస్తుంటాము. చెరువులలో స్నానాలు చేస్తారు. నూతుల దగ్గర స్నానాలు చేస్తారు.

ప్రాచీనులలో ప్రప్రథమంగా ఈజిప్షియనులు తరువాత రోమనులు, ఆ తరువాత కొంతవరకు గ్రీకులు కూడా స్నానానికి ప్రాముఖ్యతను ఇచ్చారు. ఈజిప్టులో స్నానం చేయడం బ్రహ్మాండమనిపిస్తుంది. స్నానం అంటే సాధారణ స్నానం కాదు. మొదట శరీరమంతా రకరకాల సువాసన నూనెలను పట్టించి మర్దనా చేస్తారు. క్లియోపాట్రా (Cleopatra) ప్రతి రోజూ గాడిద పాలల్లో స్నానం చేసేదట!

రోములో మహిళలు క్లియోపాట్రాను మించినవారు. రోమనులు గాడిదపాలతో పాటు మంచి మంచి పళ్ళరసాలు, లవండరు, పన్నీరు కలిపి స్నానం చేస్తారు. రోములో పెద్ద పెద్ద స్నానగృహాలు ఎంతో రమణీయంగా ఉండేవి. స్నానపు గదుల గోడలకు పూతలు పూసేవారు చలువరాళ్ళు పరచేవారు. కరకల్లా (ఇటలీ)లో నిర్మింపబడ్డ బృహత్తరమైన బేదింగ్ కాంప్లెక్స్‌లో ఒకే సారి 18 000 మంది స్నానం చేయడానికి అనుకూలంగా ఉంటుంది. ఇక్కడ వేడి నీళ్ళు, వెచ్చనినీళ్ళు. చన్నీళ్ళు. ఆవిరి, సువాసన నీళ్ళు, ఆయుర్వేద సంబంధమైన స్నానాలు 25 రకాలు ఉంటాయి. ఎవరికి కావలసిన స్నానం వారికి సిద్ధంగా ఉంటుంది.

ఈనాడు ఇతర ఐరోపాదేశీయుల కంటే ఆంగ్లేయులు అధికంగా సోపును ఉపయోగిస్తారు. కాని పూర్వం ఆంగ్లేయులు అసలు స్నానమే చేసి ఎరుగరు. 4 వ కింగ్ హెన్రీ



4 వ కింగ్ హెన్రీ

స్నానాన్ని చట్టరీత్యా అమలుపరచాడు. ఈ చట్టం ప్రకారం నైట్‌లు (kinghts) నోబిల్‌మెన్ (noblemen వారి జీవితంలో కనీసం ఒక్కసారైనా స్నానం చేయాలి.



క్లియోపాట్రా

"కలిమిగల లోభికన్నను విలసితముగు పేదమేలు వితంజియైనన్."

ఇంగ్లండుదేశపు రాజులు. రాణులు మరి
ంచెం తరచుగా స్నానం చేసేవారు. కింగ్
న్ మూడు వారాలకు ఒకసారి ఒళ్ళు రుద్దు
్స్నానం చేసేవాడు. ఎలిజబెత్ మహారాణి



ఎలిజబెత్ మహారాణి

నెల కొకసారి స్నానం చేసేది. స్పెయిన్ దేశపు రాణి ఇజబెల్లాతో పోల్చి చూస్తే ఈమె స్నానం మేలనే చెప్పుకోవచ్చు. ఇజబెల్లా తన జీవితంలో రెండు పర్యాయాలే స్నానం చేసింది. మొదట పుట్టినప్పుడు. తరువాత రెండవసారి పెళ్ళి చేసుకున్నప్పుడు.

అమెరికాలో పరిస్థితులు ఇంకా హీనాతి హీనంగా ఉండేవి. ఈనాడు సాలీనా అమెరికన్లు 2 బిలియన్ డాలర్ల విలువగల సబ్బును ఉపయోగిస్తున్నా ఒకప్పుడు ఇక్కడ మూడు ప్రదేశాలలో స్నానం చట్ట విరుద్ధం! వర్జీనియాలో ప్రతీ బాత్‌టబ్‌కి 30 డాలర్ల పన్ను వసూలు చేసేవారు. ఇంకా కొన్ని చోట్ల నెలకు ఒకసారి కంటే ఎక్కువసార్లు స్నానంచేసే నేరస్థుని జెయిలుకు పంపిన సందర్భాలు కూడా ఉన్నాయి. దీనికి రెండు ముఖ్య కారణాలు ఉండవచ్చు. ఒకటి నీటికి విపరీతమైన కరువు ఏర్పడి ఉండాలి. లేక పోతే అమెరికా చట్టాన్ని ఏర్పరచినవారు శుద్ధ వెర్రివాళ్ళయినా అయి ఉండాలి.

అనేక అపూర్వ వైజ్ఞానిక విషయాలు స్నానాల గదులలో కనుగొన్నారు. క్రూరాతి క్రూరమైన హత్యలు జరిగిన బాత్ రూమ్‌లు కూడా ఉన్నాయి. గ్రీకు యోధుడు అగమెమ్నన్ ట్రోజన్ యుద్ధం ముగించుకుని ఇంటికి తిరిగివచ్చాడో లేదో బాత్‌టబ్‌లో స్నానం చేస్తుండగా భార్య క్లైటమ్‌నెస్త్రా అమాంతం భర్తను కోపంతో చంపింది. ఫ్రెంచి విప్లవయోధుడు జీన్‌పాల్ మారాట్ స్నానం చేస్తూ ఉండగా చార్లొట్టి కార్డేచే హత్య గావింపబడ్డాడు. భౌతికశాస్త్రంలో ఆర్కిమెడీస్ తన ముఖ్య సూత్రాన్ని స్నానం చేస్తూ కనిపెట్టాడు.

అపూర్వమైన సంగీతం, సాహిత్యం కూడా ఈ బాత్‌రూమ్‌ల నుంచి బయలు దేరాయి. ప్రసిద్ధ నాటక కర్త ఎడ్మండ్ రోస్టాండ్ స్నానం చేస్తూ అనేక ప్రసిద్ధ నాటకాలు రచించాడు. 'మిల్క్ అఫ్ ఐరిస్' (milk of iris) సువాసనలు చేర్చి స్నానం చేస్తూ జర్మన్ వాగ్గేయ కారకుడు రిచర్డ్ వాగ్నర్ సుప్రసిద్ధ ఒపేరాలను వ్రాశాడు.

అలెగ్జాండ్రియాలో అరబ్బులు తమ

(మిగతా 37 వ పేజీలో)

"గతం అంతా సంప్రదాయం కాదు;
గతంలోని మంచిమాత్రమే సంప్రదాయము."

# 'బ్లాక్ బాక్స్' అంటే...

ఫ్లైట్ డాటా రికార్డరు (FDR), కాక్‌పిట్ వాయిస్ రికార్డరు (CVR) అనే రెండు పరికరాలను బ్లాక్ బాక్స్ అంటారు. ఇవి విమానంలో అమర్చబడి ఉంటాయి. ఈ రెండు



పరికారాలు ఏ పరిస్థితులలోనూ చెక్కు చెద రవు. నీటిలో తడిసి చెడిపోతాయనే భయం ఉండదు నిప్పు అంటుకుని మండిపోతాయనే భయం ఉండదు.

ఎటువంటి ఆఘాతాల (shocks) నైనా తట్టుకోగలవు. గాలివేగము, ఆకాశంలో ఎత్తు, విమానం పుంజుకోగల వేగము, తగ్గుతున్న వేగము, ఇంజను పనితనము, విమానము కంట్రోలుయొక్క పెట్టింగులు, కాలం, ఇంధనపు ఒత్తిడి వగైరా వివరాలన్నీ ఎఫ్ డి ఆర్ (FDR) ఎప్పటికప్పుడు రికార్డు చేస్తుంది.

ఏదైనా ఒక ప్రమాదం జరిగిన తరువాత FDR దొరికితే ప్రమాదం జరిగిన సమయంలో ఆకాశంలో విమాన పరిస్థితిని, ప్రమాదం జరిగిన వైనం తెలుసుకోవచ్చు.



CVR అతిసున్నితమైన చిన్న మైక్రోఫోను. ఇది కాక్‌పిట్‌లో స్వరాల శబ్దాలను గ్రహించ గలదు. కాక్‌పిట్‌లో ఇతర పరికరాలు ఇచ్చే హెచ్చరికలను కూడా ఇది గ్రహిస్తుంది. ●

---

(36 వ పేజీ తరువాయి)

దేశంలో 4,000 పబ్లిక్ బాత్‌లలో వేడిపీటి సరఫరా కోసం 70,00,000 పుస్తకాలు అమానుషంగా తగులబెట్టారు. శతాబ్దాల నాటి విజ్ఞానం బూడిద పాలైంది. ●

"సరకుల గొనవచ్చు సాధించి తేవచ్చు గోరి సుజ్ఞానంబు గొనకరాదు."

# పులుల జీవన విధానం

పులినే వ్యాఘ్రం అని కూడా అంటారు. పులిని భారతదేశపు జాతీయ మృగంగా ఎన్నుకున్నారు. భారతదేశంలోను, ఆసియా దేశపు వాయవ్య ప్రాంతాలలోను 8 జాతుల పులులు నివసిస్తున్నాయి. భారతదేశపు జాతి



రాయల్ బెంగాల్-టైగర్ కు చెందినది. ఇది ఒక విధమైన ఎరుపువర్ణపు ఇటుకరంగు లేక తోపు రంగు కలిగి శరీరం మీద నల్లటి చారలతో చూడడానికి ఎంతో అందంగా ఉంటుంది.

పులులు నీటిలో అతి సామర్థ్యవంతంగా ఈదగలవు. సాధారణంగా ఒక్కొక్క మగ పులికి అనేక ఆడపులులతో సంబంధం ఉంటుంది. అయినా ఇవి సహజంగా ఎంతో ఠీవిగా, గాంభీర్యంగా, వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసుకుంటాయి గాని కుటుంబ బాధ్యతలను ఎంత మాత్రం వహించవు. పులుల కుటుంబంలో ఆడపులులే తమ పిల్లలను సంరక్షించుకుంటూ ఉంటాయి.

పులులు అవకాశాన్నిబట్టి, అవసరాన్నిబట్టి పగలు రాత్రీకూడా ఆహారం కోసం జంతువులను వేటాడుతూ ఉంటాయి. సహజంగా అతి క్రూరమైన జంతువు పులి. అందుకే ఇది జంతువులను విలాసంకోసం చంపుతుంది. ఆడపులుల గర్భధారణ కాలము 105 మొదలు 115 రోజులు. పులి ప్రతీ చూలుకి ఒక్కొక్కసారి 2 మొదలు 6 పిల్లలను ఈనుతుంది. పెద్దరకం పులి 318 సెంటీమీటర్ల పరిమాణంతో 226 మొదలు 272 కి.గ్రాలు తూగుతుంది.

ఇవి ఎప్పుడూ చెట్లు దట్టంగా ఉండే చీకటి అడవులలో నివసిస్తాయి. సింహాలు సాధారణంగా చెట్లు అంత విస్తారంగా లేని విశాలమైన గడ్డి మైదానాలలో నివసిస్తాయి.

---

## అతి వేగవంతమైన కెమేరా

బొవింగ్ డన్ (ఇంగ్లండు) లో జాన్ హాడ్ లాండ్ (పి ఐ.) లిమిటెడ్ వారు ప్రపంచంలోనే మిక్కిలి వేగవంతమైన కెమేరాను ఉత్పాదించారు. ఇది సెకండుకు 6000 లక్షల ఫోటోలను తీస్తుంది. దీనిని ఇప్పుడు లేజరు, బాలిస్టిక్, డెటోనిక్, ప్లాజ్మా మరియు కొరోనా పరిశోధనలలో ఉపయోగిస్తున్నారు.

---

"సందర్భానుసారంగాను, స్వభావానుసారంగాను మాట్లాడగలిగిన వాడే పండితుడు."

భారతదేశంలోను, ఇతర విదేశాలలోను జంతుశాలలలో కనిపించే ప్రసిద్ధమైన తెల్లటి పులులు అసలైన పులులుకావు. తెల్ల జన్యుకణ (mutants) సంబంధంవల్ల ఉద్భవించినవే. ఈ సంకర జాతి తెల్లపులులు చాలా అరుదుగా కనిస్తాయి. మొట్టమొదట రేవా (ఇప్పుడు మధ్యప్రదేశ్‌లో ఉంది) మహారాజు తాను పట్టుకున్న తెల్లపులి 'మోహన్' దాని పిల్ల 'రాధ' సంతతిని చాలా వ్యయ ప్రయాసలతో పెంచాడు.

భారతదేశానికి పులులు సోవియెట్ యూనియన్ సైబీరియా శీతల ప్రదేశాలనుండి, చైనాలో మంచూరియానుండి వలసవచ్చినవే. ఇవి ఈశాన్య మూలనుండి దేశంలోకి ప్రవేశించాయి. మన దేశంలోకి సింహాలు మధ్య యూరపు దేశాలనుంచి వాయవ్య మార్గంగా వచ్చాయి. అనేక శతాబ్దాలనుంచీ కూడా మనదేశంలో పులులు నివసిస్తున్నా ఇది మనదేశపు వాతావరణానికి బాగా అలవాటు పడలేదు. ఎండ వేడిని అంతగా సహించలేవు. కాబట్టి ఇవి సాధారణంగా చల్లని చెట్లనీడ దట్టంగా ఉండే లోతు అంతగా లేని నీటి ప్రవాహాలలో దొర్లుతుంటాయి.

సాధారణంగా పులులు మెడకొరికి తమ వేట జంతువులను చంపుతాయి. పులి ఎంత క్రూరజంతువైనా ఆహారం తినడంలో చాలా పరిశుభ్రతను వహిస్తుంది. అశుభ్రమైన భాగాలను, ఇతర పనికిరాని భాగాలను వేరుచేసి శుభ్రమైన మాంసమును మాత్రమే తింటుంది.

## 'విస్‌డమ్ స్టార్ ఆఫ్ ఇండియా' బహుమాన గ్రహీత



రవికిరణ్

సుప్రసిద్ధ వీణావాద్య నిపుణుడు కె.యస్. నారాయణ అయ్యంగార్ మనుమడు 18 సం॥ల వయస్సు గల రవికిరణ్ మద్రాసు అడయారులో ఉన్న పద్మనాభస్వామి దేవాలయ సభాప్రాంగణంలో నిర్విరామంగా 24 గంటల కాలం గోటు వాయిద్యం వాయించి శ్రోతలను ముగ్ధపరచాడు. కేవలం 3 సం.ల ప్రాయంలో సంగీత రంగంలోకి దిగి 12 వ సం లోనే అపూర్వ నైపుణ్యాన్ని సంపాదించిన ప్రతిభావంతుడు. అనుభవజ్ఞులైన సుప్రసిద్ధ సంగీతకారుల ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించిన ఈ యువకుడు 1985 వ సం॥ 'విస్‌డమ్ స్టార్ ఆఫ్ ఇండియా' అవార్డును గెలుచుకున్నాడు.

---

"ఏది ప్రాణులకు మిక్కిలి మేలు కలిగిస్తుందో అది సత్యం; ఏది ప్రాణులకు మేలు చేయదో అది అసత్యం."

# విజ్ఞాన వేదిక

## జలగర్భ పురావస్తు అన్వేషణ

**1942** వ సం.లో ఫ్రెంచి జలగర్భ పరిశోధకుడు జాక్వెస్ వెస్‌కాస్టీ కనిపెట్టిన ఆక్వాలంగ్ (Aqualung) తో విజ్ఞాన శాస్త్రంలో "జలగర్భ పురావస్తు అన్వేషణ" అనే ఒక నూతన విభాగం ఉద్భవించింది.



ఆక్వాలంగ్ సహాయంతో జలగర్భ పరిశోధకులు అతి సునాయాసంగా జలగర్భాలలో ఎప్పుడో ఏనాడో చేరిపోయిన పురావస్తువులను పైకి తీస్తారు దీనివల్ల చరిత్రలో ఇంతవరకూ పరిష్కారంగాని రహస్యాలను, సమస్యలను సౌలభ్యంగా తెలుసుకోగలుగుతారు.

అనేక వేల సంవత్సరాలనుంచీ మహా సముద్రాలలో చేరిన అమూల్యమైన వస్తువులకు లెక్కలేదు. జలగర్భ పరిశోధకులైన ఆక్వానాటులు వీటిని భూమి మీదికి మానవాళి ఉపయోగానికి తేగలరన్న ఆశ వుంది. జలగర్భ పరిశోధకుడు పనిచేయగలిగినది 24 గంటలు కాదు, 31 నిమిషాలు మాత్రమే. సముద్రపు నీటియొక్క బ్రహ్మాండమైన ఒత్తిడివల్ల సముద్రంలో వీరు ఒకేసారిగా చాలాసేపు ఉండలేరు. సుమారు 150 అడుగుల లోతున ఏ అపాయం లేకుండా ఒక్క ఆక్వానాట్ ప్రొద్దున్న 18 నిమిషాలు, మధ్యాహ్నం 13 నిమిషాలు మాత్రమే పనిచేయగలడు.

ఈ ఆక్వానాటులకు వాతావరణం గాలి ఒక

## తరంగాల నుంచి విద్యుచ్ఛక్తి

1966 వ సం..లో ఫ్రాన్స్ రాన్స్ నదీ ముఖం (estuary) దగ్గర నిర్మింపబడిన మొట్టమొదటి స్టేషనులో నీటి కెరటాలనుంచి విద్యుత్‌శక్తిని ఉత్పాదిస్తున్నారు. సరిక్రొత్త విధానంలో నిర్మించబడిన 24 టర్బైన్ యంత్రాల సహాయంతో ప్రతి సంవత్సరం 5,44,000 కిలోవాట్ హవర్ల శక్తిని ప్రసరింపజేస్తున్నారు. రెండవ స్టేషను 1968 వ సం. లో ముర్మాన్‌స్కీ (రష్యా) దగ్గర కిప్‌లోగుబ్సీకాయాలో నిర్మింపబడింది.

"పరహింస మానిన పాపంబు చెందదు, భోగ మొల్లకయున్న బుద్ధి చెడదు."

శత్రువు. వేలకొలది సంవత్సరాల పాటు జలగర్భంలో ఉన్నవస్తువులు బయటకు తీసిన వెంటనే గాలికి ఒక్క నిమిషంలోనే చెడిపోతాయి. సముద్రంలోనుంచి తీసిన గాజు సీసాలు వాతావరణంలో గాలి తగిలినవెంటనే పగిలి ముక్కలై పోతాయి. టిన్‌రేకు గాలికి తెల్లటి పొడిగా మారిపోతుంది. ప్రాచీన కాలపు లంగరు త్రాళ్ళు పొడిపొడిగా మెత్తని ముద్ద అయిపోతాయి. నీటిలోనుంచి పైకి తీసిన కర్ర వెంటనే మూడవవంతు సైజుకి కుంగిపోతుంది. లేకపోతే పనికిరాని నుసిగా మారిపోతుంది. శాస్త్రజ్ఞులు కొంత వరకు వీటికి ప్లాస్టిక్ ప్రిజర్వేటివ్‌లు పూతలు పెట్టి సంరక్షించగలుగుతున్నా సరియైన పరిష్కార విధానం ఇంకా తెలుసుకోలేదు. మునిగిపోయిన స్వీడన్ దేశపు యుద్ధ నౌక 'వాసా' (Vasa) ను పైకి తీసి చెడిపోకుండా ఉండేందుకు పగలు రాత్రి నీటితో తడపవలసి వచ్చింది.

షార్కు చేపలు, ఆక్టోపస్ ఇతర అపాయకరమైన చేపలవల్ల ఈ అక్వానాటులకు బాధ ఎంతమాత్రం ఉండదు.

## 1858 లో బిగ్‌బెన్ స్థాపన



బ్రిటన్ ముఖ్యనగరం లండన్ పార్లమెంటు భవనం క్లాక్ టవర్‌లో ఏర్పాటైన వెస్ట్ మినిస్టర్ క్లాక్ ప్రపంచంలో సుప్రసిద్ధమైన గడియారాలలో ఒకటి. 1858 వ సం.లో ఈ గడియారం టవర్‌లో స్థాపించబడింది. ప్రతీ పావుగంటకు నాలుగు చిన్న చిన్న గంటల మీద గంటలు కొడుతుంది. ప్రతీ గంటకు 14 టన్నులు తూగే 'బిగ్‌బెన్' పెద్ద గంట మీద గంట కొడుతుంది.

ఇంతకు పూర్వం ఇటువంటి కార్యక్రమాలు చేపట్టిన సర్ బెన్‌జమిన్ హాల్ అనే ప్రభుత్వోద్యోగివల్ల 'బిగ్‌బెన్'కు ఆ పేరు సార్థకమైంది. ఈ గడియారం ఓవరు 319 అడుగుల (55 మీటర్లు) ఎత్తు ఉంది. కాబట్టి వేసవి కాలం. శీతాకాలం, పగలు, రాత్రి ఉష్ణోగ్రతలలో మార్పుల ప్రభావం దీని మీద ఉంటుంది. అయినా గడియారం చాలా కచ్చితంగా సమయాన్ని చూపుతుంది. బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ (బిబిసి) టైము సిగ్నల్ 'పిప్'లను, బిగ్‌బెన్ గంటలను గ్రీన్‌విచ్ అబ్జర్వేటరీ నుంచి ప్రసారం చేస్తుంది సాధారణంగా టైమ్ సిగ్నల్ ఆరవ పిప్‌తో గడియారం మొదటి గంట ప్రారంభమవడం ఒకేసారి వింటాము.

# ఈజిప్టు పిరమిడ్లు

ఇంజనీరింగు, సాంకేతిక పరిజ్ఞానం అమితంగా అభివృద్ధి పొందిన ఆధునిక యుగంలో కూడా ఈజిప్టు పిరమిడులలో



ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించేది "ది గ్రేట్ పిరమిడ్". 13 ఎకరాల విశాలమైన ఇసుక ఎడారి ప్రదేశంలో 40 అంతస్తుల భవనం అంత ఎత్తుగా నిర్మించబడిన ఈ పిరమిడ్ యాత్రికులకు వింత కలిగించక మానదు.

ఈ బ్రహ్మాండమైన నిర్మాణం 481 అడుగుల ఎత్తు, 756 అడుగుల వెడల్పు కలిగి ఉంటుంది. దీనిలోపల నాలుగు ప్రక్కల రోములోని సెంట్‌పీటర్స్ చర్చి, లండన్‌లోని వెస్ట్ మినిస్టర్ అబ్బే, సెంట్ పాల్స్ చర్చి, ఫ్లారెన్స్‌లోని కెథీడ్రల్స్, ఇటలీలోని మిలన్ పట్టగలంత వైశాల్యం ఉంటుంది.

గిజా పీఠభూమి ప్రదేశంలో నేడు జన సమర్దంతో కిటకిటలాడే కెయిరో పట్టణానికి 5 మైళ్ళ దూరంలో నైఋతి దిక్కుగా ఇంకి పెద్ద పిరమిడును నిర్మించడానికి వేలకొద్దీ తాపీ పనివాళ్ళు, కూలీలు 30 సంవత్సరాలు శ్రమ పడ్డారు.

ఈ పెద్ద పిరమిడును కట్టడానికి ఉపయోగించిన రాళ్ళు ఒక్కొక్కటి $2\frac{1}{2}$ టన్నులు మొదలు 15 టన్నులదాకా ఉన్నాయి. ఇటువంటి రాళ్ళు దీనికి సుమారు 25,00,000 ఉపయోగించబడ్డాయి. వీటిని చెక్కడానికి గానీ, క్వారీల నుంచి త్రవ్వడానికి గానీ, మోసుకువచ్చి వీటిని ఎత్తిపెట్టడానికి గానీ ఎటువంటి యాంత్రిక సౌకర్యాలు లేవు వీరు ముఖ్యంగా ఏటవాలు బల్ల (inclined plane), లీవరు, రోలరు మాత్రమే ఉప

---

## విజయం రెండురకాలు

రెండు రకాల విజయం ఉంది. ఒకటి చాలా అపూర్వమైనది. ఇతరులకు ఎవ్వరికీ లేని సామర్థ్యం-అదే మేధస్సు లేక బుద్ధి కుశలత. సాధారణంగా సగటు మానవుడు గెలుచుకున్న విజయం మేధకాదు. అందరితోపాటు సాధారణ గుణాలు కలవాడు. కాని ఇతడు అసాధారణ గుణాలను ఇతరుల కంటే అధిక స్థాయికి అభివృద్ధి చేసుకున్నవాడు.

—థియొడోర్ రూస్‌వెల్ట్

---

"జీవునికి అజ్ఞానము సహజముగా నుండినను,
పురుష ప్రయత్నముచేత అది నశించును."

యోగించి ఈ రాళ్ళను అతి సౌలభ్యంగా ఎత్తగలిగారు.

ఆ కాలంలో కొలతలకు తగిన పరికరాలు లేవు. అయినప్పటికి రాళ్ళకు అంచులు తీర్చి మూలలు ఏర్పరచి సుని



శితంగా, అతి ఖచ్చితంగా చెక్కబడ్డాయి. ప్రతీ ముఖతలం అతి ఖచ్చితంగా దిక్సూచి సూచించే దిక్కులలో ఏర్పరచారు. పిరమిడు లోపలి క్రింది భాగంలో పెట్టిన కొన్ని సున్నపురాళ్ళు అతి సన్నిహితంగా ఒకదాని కొకటి దగ్గరగా సందులేకుండా ఉంటాయి. వీటి మధ్య సన్నని సిగరెట్టు కాగితం కూడా పోవడానికి సందు ఉండదు.

ఆధునిక ఆకాశ హర్మ్యాలు (sky scrapers) నిర్మించినట్టుగానే పిరమిడ్లు నిర్మించ డానికి అతి జాగ్రత్తతో కూడిన సాంఘిక ఉద్యమం అవసరం. నైలునదీ తీరం నుంచి రాతికట్టడం సుమారు అరమైలు ఎత్తువరకు గిజా పీఠభూమి వరకు లేవదీసారు. దీనిని నిర్మించడానికి మాత్రం 10 సంవత్సరాలు పట్టింది. ఆ ఏటవాలుమీద కర్రలను దొర్లిస్తూ వాటిపై రాతి బండలను పెకి ఎత్తారు. ఈ పెద్దపెద్ద రాళ్ళకు బలిష్ఠమైన పొడుగాటి పేపిరస్ త్రాళ్ళను కట్టి లాగారు

పర్వతాలలో వందలకొద్దీ అడుగుల పొడగైన స్వరంగాలు ఏర్పరచారు. ఈ స్వరంగాలలో రెండవ ప్రపంచ యుద్ధసమయంలో బ్రిటిష్ సైనికులు ఇచ్చట 5000 సంవత్సరాలకు పూర్వం కార్మికులు ఉపయోగించిన పేపిరస్ త్రాళ్ళను కనుగొన్నారు.

ఈ పెద్ద పిరమిడ్ మధ్యభాగంలో భూమికి 140 అడుగుల ఎత్తుగాను, పిరమిడ్ సూచీకి ఎన్నో అడుగులు దిగువగా 34 అడుగుల పొడవు, 17 అడుగుల వెడల్పు, 19 అడుగుల ఎత్తుగల రాజాంతఃపురం (king's chamber) ఉంది. ఈ గది పూర్తిగా నున్నగా చేయబడిన గ్రానైటు పలకలతో కప్పబడింది. దీనికి ఒకప్రక్క భూమిలోకి ఫారోచియాప్స్ (pharaoh cheops) తన కోసం రాతి సార్కోఫాగస్ (శవపేటిక)ను ఏర్పరచుకున్నాడు.

## అధిక వ్యయంతో కూడిన పెద్ద పైపులైను

ప్రుడ్‌హో (అమెరికా) అఖాతం నుంచి వాల్డెజ్ వరకు గల అలాస్కా పైపులైను (1276 కి మీ.) ప్రపంచంలోనే మిక్కిలి పెద్దది. 1977వ సం.లో పూర్తికావింపబడిన దీని మొదటి దశకు సుమారు 60 000 లక్షల డాలర్లు వ్యయం అయింది. 48 అంగుళాల వ్యాసంగల ఈ పైపు గుండా రోజుకి 20 లక్షల పీపాల ముడిచమురు పంపబడుతూంది.

"కష్టములనొందు పిమ్మట గలుగు సుఖము
స్వల్పమైనను మది దోచు నధికముగను."

కాని అనేక శతాబ్దాల తరువాత - భూస్థాపితం అయిన తరువాత అయి ఉండవచ్చు. దొంగలు గ్యాలరీకి ఎక్కే దారిలో మెత్తటి సున్నపురాతిని త్రవ్వి లోపలకు ప్రవేశించి ఉండాలి. తరువాత 9 వ శతాబ్దంలో పాతి పెట్టబడిన అమూల్యధనాన్ని తీసుకుందామనే ఆశతో కాలిఫ్ అల్‌మామూన్‌కు చెందిన అరబ్ పనివాళ్లు పెద్ద స్వరంగాన్ని ఏర్పరచారు. వీరికి ఇక్కడ ఏమీ దొరకలేదు గానీ పెద్ద పెద్ద తుపాకులతో ఒక సమాధిని గొన్నారు. ఇప్పుడు యాత్రికులు ఈ స్వరంగం గుండా లోపలకు ప్రవేశిస్తారు. తరువాత అరబ్బులు ఈ సున్నపురాయిని పూర్తిగా తీసేసి వారి మసీదులను నిర్మించుకున్నారు.

చియాప్స్ తరువాత వచ్చిన చెఫెరెన్ (Chephren) గిజా పీఠభూమి మీద తన గోరీని నిర్మించుకునేటప్పుడు ఇచ్చట కార్మికులు పెద్ద పిరమిడును నిర్మించినప్పుడు నిరుపయోగంగా వదిలి పెట్టబడిన పెద్ద రాతిని ఉపయోగించి స్పింక్స్ (sphinx) గా చెక్కారు. సింహాకారంలో ఉన్న ఈ రాతి స్పింక్స్ బొమ్మ ప్రాచీన స్మశాన వాటికను కాపలా కాస్తూంది. క్రీస్తు పుట్టుటకు సుమారు ఒకటిన్నర శతాబ్దాలకు ముందు గ్రీసుదేశపు ప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త బైజాంటియమ్ ఫిలాన్ ప్రపంచపు ఏడు వింతలు (The seven wonders of the world) అనే చిన్న గ్రంథాన్ని రచించాడు. ఈ ఏడు వింతలలో ఈజిప్టు పిరమిడు ఒకటి. మిగిలిన వాటికంటే 2000 సంవత్సరాల పూర్వపు ఈ పిరమిడు ఇంకా చెక్కు చెదరకుండా ఉంది. ఫారో చియాప్స్ నైపుణ్యాన్ని, మనో నిశ్చయాన్ని నేటికీ ఇది చాటుతూంది.

---

# మనం వైజ్ఞానిక యుగంలో నివసిస్తున్నాము!



మనం ఇప్పుడు వైజ్ఞానిక యుగంలో నివసిస్తున్నాము. అనేక విప్లవాలను గురించి వింటున్నాం. చదువుతున్నాము. కాని గత 150 సం. లలో బ్రహ్మాండమైన విప్లవశక్తి విజ్ఞానమే. ఈ విజ్ఞానం రాజకీయ సంస్థలను, సాంఘిక సంస్థలను, ఆర్థిక సంస్థలను మార్చి వేసింది విజ్ఞానంలో ఈ మార్పిడి విధానం నిరంతర ప్రగతిగా పరిణమిస్తుంది. దీనిని మనం అర్థం చేసుకుని దానికి తగినట్లుగా జీవించడం మన కర్తవ్యం.

—జవహర్‌లాల్ నెహ్రూ

"అర్థమెఱుగని చదువు బల్ వ్యర్థమగును,
ఖరము మొయ్యదె చందన ఖండములను."

# తామరకు ప్రకృతి చికిత్స

హెచ్. కె బఖ్రు

చర్మానికి సంభవించే రోగాలలో తామర ఒకటి. సాధారణంగా చర్మం ఎర్రబడి చిన్నచిన్న పుళ్ళు, చీముతో నిండిన పొక్కులు బయలుదేరుతాయి. దీర్ఘకాలం నుంచీ మలబద్ధకంతో బాధపడేవారికీ, మూత్రపిండాలు సరిగా పనిచేయక చెడిపోయిన వారికీ ఈ చర్మరోగం సంభవిస్తుంది.



తామర

శరీరంలో చర్మం విస్తారమైన ఒక విసర్జనాంగం. చర్మంద్వారా అనేక విషపదార్థాలు అతి సులభంగా విసర్జింపబడుతూంటాయి. చర్మతలం చాలా విస్తారంగా ఉంటుంది కాబట్టి సాధారణంగా మూత్రపిండాలు (కిడ్నీలు), ప్రేగులు, ఊపిరితిత్తులు, విసర్జించలేని పదార్థాల నన్నిటినీ ఇది విసర్జిస్తుంది.

తామర తీవ్రంగా పరిణమించినప్పుడు చర్మం ఎర్రబడి వాస్తుంది. చిన్న చిన్న పుళ్ళు బయలుదేరతాయి. చీముతో నిండిన పొక్కులు లేస్తాయి వేడి పుట్టుకు వస్తుంది. దురద బయలుదేరుతుంది. మంట పెడుతుంది. పుళ్ళు పగిలి రసికారి చర్మం చెమ్మెక్కుతుంది. కారిన రసి అట్టలు కడుతుంది.

తామరకు ముఖ్యకారణం ఎలర్జీ ఒకటి. కొంతమంది ఎక్కువగా డెటెర్జెంటు పోవు వాడేవాళ్ళకి చేతులమీద ఎలర్జీ వస్తుంది. ప్రత్యేక లోహాల ఉంగరాలు ధరించడం వల్ల కూడా ఎలర్జీ ఏర్పడుతుంది తామరకు ముఖ్య

## మెక్సికో నగరం కాలుష్యపు రేటు 97.5 శాతం

మెక్సికో (మధ్య అమెరికా) నగరం కాలుష్యం 97.5 శాతం అని నిర్ణయించబడింది. ఇచ్చట కాలుష్యాన్ని అధికపరచడానికి మరో కారణం ఈ నగరాన్ని పట్టి పీడిస్తున్న 1750 లక్షల ఎలుకలు. తలసరి సగటున 10 ఎలుకలు నగరంలో బయట పేరుకున్న పెంటకుప్పలలో ప్రవృద్ధిని పొందుతున్నాయి. మెక్సికో నగరంలో నివసించడం రోజుకు 5 పెట్టెల సిగరెట్లు కాల్చడం అంత అపాయకరం అని వాతావరణ నిపుణులు అభిప్రాయపడుతున్నారు.

"ఉన్నదున్నట్టు చెప్పడం సత్యమూ కాదు:
అయథార్థమైనంత మాత్రాన అసత్యమూ కాదు."

కారణం శరీరంలో వివిధ విసర్జన భాగాల నుండి దేహంలోని విషపదార్థాలు సరిగా విసర్జించక పోవడమే.

మూత్ర పురీష విసర్జనల ద్వారా, ఊపిరితిత్తుల ద్వారా. ఊపిరి పీల్చడం వల్ల, చర్మపు సూక్ష్మపు రంధ్రం ద్వారా చెమట, విషపదార్థాలు, శరీరంలో జనించే అనవసర పదార్థాలు ఎప్పటికప్పుడు విసర్జింపబడుతుంటాయి. ఇతర విసర్జనావయవాల ద్వారా విసర్జన సక్రమంగా లేనప్పుడు చర్మంలోని సూక్ష్మరంధ్రాలు ఎక్కువ పనిచేసి శ్రమపడవలసి వస్తుంది చెమట ఎప్పటికప్పుడు విసర్జింపబడకపోతే తామర, గజ్జి కురుపులు చర్మం మీద బయలుదేరతాయి

తామరను నివారించుకోడానికి మొదట రక్తాన్ని శుభపరచుకోవాలి. శరీరాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవాలి. రోగి ఆరుబయట మంచిగాలిని పీల్చుకోడం ఉత్తమం. బిగువైన బట్టలు. దుస్తులు ధరించకూడదు. ప్రతిరోజూ రెండు లేక మూడు లీటర్ల నీటిని త్రాగాలి. రోజుకి రెండు, మూడు పర్యాయాలు స్నానం చేయడం మంచిది. స్నానం చేసే ముందు తామర లేని ఇతర శరీర భాగాలను చేతులతో రుద్దుకోవాలి. మర్దన చేసుకోవాలి. అప్పుడు రక్తం బాగా ప్రవహిస్తుంది. తామర ఉన్న చోట కొబ్బరినూనె పట్టించాలి. దీనివల్ల చర్మానికి మృదుత్వం ఏర్పడుతుంది.

తామర చికిత్సకు మొదట ఒక వారం పండ్లరసంతో ప్రారంభించాలి. తరువాత ఉడకబెట్టిన చప్పిడి (ఉప్పు లేకుండా) కూరగాయలు గోధుమపిండి రొట్టెలు తినాలి.

బదులు కొబ్బరినూనె వాడవచ్చు. కొంత కాలానికి మెల్లిగా ఆహారంలో పెరుగు, పాలు ఉపయోగించడం ప్రారంభించవచ్చు. క్యారెటు దుంపలు, తర్బూజాపళ్ళు చాలా మంచివి. ఊరగాయలు, ఉప్పు, పంచదార పులుపు వస్తువులు, ఆల్కహాలు, కాఫీ, టీ వంటివి చాలా అపకారం చేస్తాయి.

## పొగ త్రాగుడు వల్ల కలిగే కాలుష్యం



ప్రపంచం మొత్తంమీద సాగుబడి అవుతున్న 57 లక్షల టన్నుల పొగాకుతో పొగ త్రాగేవాళ్ళు ప్రతిసంవత్సరం సగటున 10.5 టన్నుల కాడ్మియం, 14.8 టన్నుల లెడ్, 48 4 టన్నుల రాగి మరియు ఇతర లోహాలతో వాతావరణాన్ని కాలుష్యం చేస్తున్నారని రష్యా శాస్త్రజ్ఞుల అంచనా. వాతావరణంలో అదనపు కాడ్మియం బ్లడ్ ప్రెషర్, కిడ్నీ రోగాలే కాకుండా క్యాన్సర్ సంబంధమైన రోగాలకు కూడా దోహదకారి.

"శౌర్యంబు గలుగుట జన్మ సాఫల్యంబు, శాంత మాత్మ వివేక సాధనంబు."

ప్రొద్దున్నే ఎండవేడిలో సన్‌బాత్ తీసు కుంటే అపాయకరమైన సూక్ష్మజీవులు నశించిపోతాయి. బాగా చెమటపట్టేదాకా ఎండలో గుంజీలు తీయాలి. ఎండ తీక్ష ణంగా ఉంటే తలమీద ఒక తడి తువ్వాలు కప్పుకోడం మంచిది. తరువాత చన్నీటి స్నానం చేయాలి.

తామర ఉన్నచోట మట్టిపట్టు (mud pack) వేయడం కూడా చాలా మంచిది. గంటసేపైన తరువాత పట్టు తీసేయాలి. ఈ విధంగా రోజుకు రెండు మూడు పర్యాయాలు మట్టిపట్టు వేయాలి.

తామర విపరీతంగా పరిణమించినప్పుడు రోగి వారానికి ఒకసారి ఉపవాసం చేయడం మంచిది రోగం పూర్తిగా నిర్మూలించేదాకా వారానికి ఒకసారి ఉపవాసం చేయాలి.

తామరతో పాటు అజీర్ణం, గౌట్, మధు మేహం గల రోగులు మొదట ఈ రోగా లను నయం చేసుకుని తరువాత తామరను నివారించుకోడానికి ప్రయత్నించాలి. చిన్న పిల్లలలో తామరను పండ్లరసం, తేనెతో కలిపిన మంచినీళ్ళు పట్టించి సులభంగా కుదర్చవచ్చు.

ఒక్కొక్కప్పుడు చల్లని నీటితో ఒత్తడం వల్ల లాభం కనిపిస్తుంది. తామర పట్టిన చోట మెత్తని బట్ట చుట్టి ఆ కట్టు 55°-60°F చల్లని నీళ్ళతో తడుపుతూండాలి. మొట్ట మొదట నొప్పి. దురద ఎక్కువగా అని పించినా కొంతసేపటికి తగ్గిపోతుంది. చల్లటి నీటి ఒత్తడం రోజుకు రెండుసార్లు చొప్పున ఒక వారం రోజులు అనుసరించాలి.

వేడినీళ్ళ కాపడం కూడా చేయవచ్చు. [illegible] నిమిషాలపాటు వేడినీటి కాపడం అయి[illegible] తరువాత చన్నీటి ఒత్తడం పెట్టాలి. వీటి[illegible] పాటు సూర్యనమస్కారాలు, యోగాసనా[illegible] కూడా ఎంతో ఉపకారం చేస్తాయి.

---

## త్యాగబుద్ధి వల్లనే జీవితంలో ఆనందం



మానవుడు తనకోసం కాకుండా ఇతరు[illegible] కోసం మాత్రమే జీవిస్తున్నాననే వి[illegible] ఆశయాన్ని పెంచుకుంటేనే తప్ప భార[illegible] దేశంలో ప్రజానీకానికి బద్ధమైన జీవిత అసంభవం.

భగవద్గీతలో, ఉపనిషత్తుల్లో, బైబిల్‌లో ఖురాన్‌లో, చివరగా జానపద సాహిత్యంలో వివరింపబడిన ఆనందాన్ని మించిన ఆన[illegible] దాన్ని మానవుడు వర్తమానంలోగానీ భవిష్యత్తులోగానీ పొందలేడు. త్యాగబు[illegible] లేక వైరాగ్యభావంతో స్వధర్మాన్ని, సాంఘి[illegible] ధర్మాన్ని అనుసరించినప్పుడే సంపూ[illegible] సచ్చిదానందాన్ని అనుభవించగలడు.

"పరమ నాస్తికునకు భక్తివాదము లేల?"

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.]

1. జె. రాము, 18 సం.లు, ఇంటర్ మొదటి సంవత్సరం విద్యార్థి, ఇం. నెం. 9-59, సీతారామపురం, మిరియాల గూడ-508 207.
భరతనాట్యం చేయడం. కలం స్నేహం.

2. బుస్సా విజయకుమార్, 28 సం.లు, ఇం. నెం. 3-4-25. మార్కెట్ రోడ్, జనగామ - 506 167. (వరంగల్ జిల్లా)
దైవభక్తి. మిత్రుల పట్ల స్నేహభావం, ఆపదలో ఆదుకోవడం.

3. సురభి రామ్మోహన్, 26 సం.లు, ఎస్ ఎస్ పి s/o బాబూరావ్ గారు, ఇం నెం. 1-1-61/1, c/o వీనస్ ఫొటో స్టూడియో, కంచర్లపాలెం, విశాఖపట్టణం-530 008.
కలంస్నేహం, పత్రికలు చదవడం.

4. శ్రీమతి టి. విజయారెడ్డి, 23 సం.లు, వనిపెంట S.O., 5 6 173 (కడప జిల్లా).
స్టాంపులు, నాణెములు, కరెన్సీ సేకరణ, వివిధ దేశాల రేడియో కార్యక్రమాలు వినడం. కలం స్నేహం

5. వేమూరి పుల్లారావ్, పల్లాపురం, తాలడగు, (ఖమ్మం జిల్లా) 507 304.
పుస్తకాలు చదవడం, పూలచెట్లు పెంచడం, ఆటలాడటం.

## ఇతరులు నమ్మలేని విధంగా జీవిస్తాను



గ్రీకు తత్త్వవేత్త ప్లేటోతో అతడిని ఎంతోమంది విమర్శిస్తున్నట్టు ఒక స్నేహితుడు చెప్పాడు. దానికి విభ్రాంతగా "చింత లేదు. ఆ విమర్శలను ఎవ్వరూ నమ్మలేనట్టుగా జీవిస్తాను" అన్నాడు ప్లేటో.

---

"సత్యంబు గలచోట సమకూరు శుభములు
వేమంబు గలచోట విలుచు సిరులు."

# జాతీయ వార్తలు

## భారతదేశపు మొట్టమొదటి కాస్టిక్‌సోడా ఉత్పాదక కేంద్రం:

కేంద్రపాలిత ప్రదేశమైన పాండిచ్చేరిలో అధునాతన అయాన్-ఎక్స్‌ఛేంజి-మెంబ్రేన్-సెల్ సాంకేతిక విజ్ఞాన విధానంతో కాస్టిక్ సోడా ఉత్పాదక కేంద్రం స్థాపింపబడింది.

* * *

## సముద్రపు నీటి నుండి ఉప్పు తయారీ:

విద్యుచ్ఛక్తి ఉత్పాదనకువాడే సముద్రపు నీటిని చల్లబరచి ఉప్పుని ఉత్పాదించే విధానంలో తమిళనాడు ప్రపంచంలో ప్రథమ స్థానాన్ని పొందింది. మహాబలిపురం దగ్గర కల్పాకమ్‌లో నెలకొల్పబడిన మద్రాసు ఎటామిక్ పవర్ స్టేషన్ నుంచి కూలాంట్ (చల్లబరచిన) సముద్రపునీరు మద్రాసు నగరానికి 40 కి.మీ దక్షిణంగా తీరప్రదేశం కోవలాంగ్ ఉప్పుకయ్యలకు మళ్ళింపబడుతుంది. ఈ 25 క్యూసెక్స్ (cusecs) నీటివల్ల అదనంగా 5,000 ఎకరాల మేరలో ఉప్పు ఉత్పాదించబడుతుంది. దీనివల్ల ప్రస్తుతం సాలీనా 80,000 టన్నుల ఉప్పు ఉత్పాదన 2 లక్షల టన్నులకు పెరుగుతుంది.

*

## ఆగ్రాలో 'జ్ మ్యూజియం:

ఉత్తరప్రదేశ్ ఆగ్రాలో తాజ్‌మహల్ కాంప్లెక్స్‌లో నకార్‌ఖానాలో తాజ్‌మ్యూజియం స్థాపింపబడింది. ముఖ్యంగా షాజహాన్ చక్రవర్తి తాజ్‌మహల్ నిర్మాణంలో ఉపయోగించిన వస్తుసామగ్రి ఇక్కడ ప్రదర్శింపబడుతుంది.

* * *

## దోసకాయల లోపల వేడి!



ఆంగ్లంలో 'చల్లగా దోసకాయ' (Cool as a cucumber)లాగ అంటారు. కాని దోసకాయల లోపల వేడి, చుట్టుపట్ల వేడికంటే 20 డిగ్రీలు అధికం.

"దేవుని స్మరణకు మించిన పుణ్యం లేదు:
దేవుని ఉపేక్షకు మించిన పాపం లేదు."

## ఖాల్‌గోన్ సూపర్

ట

భాగల్‌పూరు(బీహారు) జిల్లాలో ఖాల్‌గోన్ (Khalgaon) సూపర్ థెర్మల్ పవర్ ప్రాజెక్ట్ ఏర్పరచడానికి పబ్లిక్ ఇన్వెస్ట్‌మెంట్ బోర్డువారు, ఇటీవల అనుమతించారు. 2,100 mw శక్తికి ఏర్పాటైన ఈ ప్రాజెక్ట్‌కి ఖర్చు రూ. 2,000 కోట్లు అని అంచనా వేయబడింది. ప్రాజెక్ట్ ప్రథమ దశలో ఒక్కొక్కటి 200 mw శక్తిగల 3 థెర్మల్ పవర్ యూనిట్లు 4 సంవత్సరాలలో పూర్తి కాగలవు.

## భారతదేశపు మొట్టమొదటి కార్పొరేట్ హాస్పిటల్:

దేశంలో రోగులు ఉత్తమ తరగతి చికిత్సకు విదేశాలకు వెళ్ళే అవసరం లేకుండా అన్ని హంగులతోను, అధిక ప్రమాణాలతో అతి విస్తృతమై సర్వోత్కృష్టమైన బహుముఖ సౌకర్యాలతో మద్రాసులో ఏర్పరచిన అపోలో హాస్పిటల్ భారతదేశపు మొట్టమొదటి కార్పొరేట్ హాస్పిటల్. మొత్తం రూ. 10 49 కోట్ల వ్యయంతో 2 లక్షల చదరపు అడుగుల వైశాల్యం గల ఈ హాస్పిటల్ 50 ప్రత్యేక మరియు విశిష్ట విభాగాలతో అధునాతన సరంజామాతో ఏర్పాటైంది. సుప్రసిద్ధ భారతీయ వైద్య నిపుణుల సేవా సౌకర్యం ఇక్కడ లభిస్తుంది.

## బ్రిటిష్ ఫిల్మ్‌లో విక్టర్ బెనర్జీ ముఖ్య పాత్రను వహిస్తాడు:

కలకత్తాలో జన్మించిన 30 సంవత్సరాల విక్టర్ బెనర్జీ బ్రిటిష్ డైరెక్టర్ డేవిడ్ లీన్ ఇ. ఎమ్. ఫాస్టర్ వ్రాసిన నవల ఆధారంగా తీసిన చిత్రం 'ఎ పాసేజ్ టు ఇండియా'లో ముఖ్యపాత్రను వహిస్తాడు. ఇతడు సత్యజిత్ రే మొట్టమొదటి హిందీ సినిమా 'షత్రంజ్ కీ ఖిలాడి'లో నటించాడు.

* * *

## ఇండియన్ ఎయిర్‌ఫోర్సుకి మిరాజ్ 2000 ఫైటర్ ఎయిర్‌క్రాఫ్ట్:

ఇండియన్ ఎయిర్ ఫోర్సుకి ఫ్రాన్స

(మిగతా 54 వ పేజీలో)

## కొలంబస్ తల ముగ్గు బుట్ట!



అమెరికాను కనిపెట్టిన సుప్రసిద్ధ క్రిస్టఫర్ కొలంబస్‌కి 30 వ సంవత్సరంలోనే తల తెల్లగా ముగ్గుబుట్టలా ఉండేది.

"ఈ యూరికి ఆ యూరెంతో ఆ యూరికి ఈ యూరును నంతే."

# పంటి ము త

డా. జె. జి. కన్నప్పన్



[డా. జె. జి. కన్నప్పన్ మధురై మెడికల్ కాలేజీలో డెంటల్ సర్జరీ ప్రొఫెసర్ మరియు మధురై గవర్నమెంటు రాజాజీ హాస్పిటల్‌లో డెంటల్ సర్జన్. వీరు మద్రాసు మెడికల్ కాలేజీ మెడికల్ రిలీఫ్‌వింగ్‌లో 26 సంవత్సరాలు సేవ చేసారు. సోషియో మెడికల్ రిలీఫ్‌కు వీరు 1982 వ సం. లో డా. బి. సి. రాయ్ నేషనల్ అవార్డును గ్రహించారు.]

ముఖానికి అందాన్నిచ్చే పళ్ళు ఆహారం నమిలి తినడానికి, మాట్లాడడానికి సహకరించడమే కాక నేరాలను, నేరస్థులను పరిశోధించడానికి, పెద్ద పెద్ద ప్రమాదాలలో ఇరుక్కొని గాయాలు పడ్డవారిని గుర్తుపట్టి తెలుసుకుని నిర్ధారించడానికి, భీమాహక్కులను నిరూపించడానికి తగినంత ఉపయుక్తమైన నిదర్శనాన్ని ఇస్తాయి.

20 వ శతాబ్దం ప్రారంభంలో అభివృద్ధి పొందిన దేశాలలో నేరాలకు సంబంధించిన విషయాల పరిశోధనకు దంత నిదర్శనాన్ని ఉపయోగించేవారు దంత పరిశీలన గుర్తు పట్టడానికి సునిశితమైన నిదర్శనాన్ని కలిగిస్తుంది.

పళ్ళలో రక్తనాళాలుగానీ, నరాలుగానీ లేకుండా ఎక్కువ సున్నపుపాలు కలిగి ఉంటుంది. అందుచేత ఇవి ఎట్టి విపరీత పరిస్థితులలోను చెడిపోవు. ఎక్కువ ఉష్ణోగ్రతవల్లగానీ, మరే కారణం వల్లగానీ నశిం

## అరుణాచల ప్రదేశ్‌లో 'రెడ్‌చెర్రీ బ్లాసం' చెట్టు

కె. పి. సహానీ, హెచ్. బి. నెయ్‌థాని అనే ఇద్దరు వృక్ష శాస్త్రజ్ఞులు అరుణాచల ప్రదేశ్ కామెంగ్‌లో పెరీలా అనే చోట అందమైన ఎర్ర చెర్రీ పూలచెట్లను కనుగొన్నారు. ఇంతవరకూ ఈ చెట్టు తైవాన్, చైనా మరియు జపాన్‌లోనే ఉంది.

"ప్రతి మానవుని అవసరానికి కావలసినంత ఉంది, కాని మానవుని ఆశకు తగినంత ఉండదు." — గాంధీజీ

చవు. అందువల్ల మానవ శరీరంలో నోటి పళ్ళు నమ్మకమైన నిదర్శనాన్ని, సాక్ష్యాన్ని కలిగిస్తాయి.

మానవునికి కొన్ని సహజ స్వభావాలు ఉంటాయి. నేరస్థుడు దొంగతనంగానీ, నేరంగానీ, హత్యగానీ చేయడానికి ముందు ఆకలి బాధను తీర్చుకోడానికి కడుపునిండా తింటాడు. ఈ కారణంచేత సహజంగా అప్పటికప్పుడు కనిపించిన వాటిని తొందరగా కొరికి తింటాడు. ఆపిల్ పండు, జామ పండు, గోధుమ హల్వా వగైరా. వీటిని కొరికినప్పుడు కొరికినచోట పంటి గుర్తులు ఏర్పడతాయి.



ఇంతేగాకుండా భయోత్పాతాలు కలిగించేటప్పుడు గానీ. కామోద్రేకం వల్ల అనుసరించే అత్యాచారాలలోనూ సాధారణంగా కొరకడానికి ప్రయత్నించినప్పుడు దంతక్షతాలు ఏర్పడతాయి. వీటిని జాగ్రత్తగా ఫొటోగ్రాఫులు తీసి రికార్డు చేయాలి. ప్లాస్టర్ మోడల్స్ తయారుచేసి నేరస్థుని నోటి పండ్లతో వీటిని సరిపోల్చి గుర్తు పట్టవచ్చు. నోటితీరు, నోటి పండ్లవరుస, పండ్లసైజు, వంపులు మొదలైనవి అందరకూ ఒకే సమంగా ఉండవు. ఇవి వ్యక్తి వ్యక్తికీ మారుతూంటాయి.

మానవ శరీరంమీద కొరికినప్పుడు పడ్డ పంటి గుర్తులనుగానీ, పండ్లు, కాయలు మొదలగు వాటిని కొరికినప్పుడు వాటిమీది పంటి నొక్కులను గానీ సాధ్యమైనంత త్వరలో రికార్డు చేయాలి. ఆలస్యమైన కొద్దీ అవి చెరిగిపోవడానికి అవకాశ ముంటుంది.

చిన్న చిన్న కలహాలు, దెబ్బలాటలు జరిగినప్పుడు పరస్పరం ఒకరిని ఒకరు కొరుక్కోడం కూడా జరుగుతుంది. అట్టి సమయాలలో శరీరం మీద పంటి గుర్తులు పడకమానవు. కామోద్రేకంచేత అత్యాచారాలు, ఇతర నేరాలలో కొరికిన గుర్తులు ఏర్పడతాయి. మానసికతత్త్వ శాస్త్రరీత్యా

## మాట్లాడుకునే భాషలు మొత్తం 2796

ప్రపంచం మొత్తం మీద వ్రాతకు అనుకూలంగా లిపి సంస్కారంతో మాట్లాడుకోడానికి వీలుగా 2796 భాషలున్నాయని ఫ్రెంచి అకాడమీ వారి మదింపు. ఇంకా ఏన్నో మాట్లాడుకునే భాషలకు లిపి లేదంటున్నారు వీరు.

"బ్రహ్మ చింతనము ఉత్తమమైనది. శాస్త్ర చింతనము మధ్యమము. మంత్రచింతన అథమము. తీర్థభ్రాంతి అథమాథమము."

కొంతమంది తమ ఉద్రేకాన్ని తగ్గించుకోడానికి తమంతట తాము గిల్లుకోడం, కొరుక్కోడం కూడా ఉంటుంది. కాబట్టి ఇటువంటి గుర్తులను, పైన వివరించిన నేరస్థులు కావించిన గుర్తులను వేరు వేరుగా పరిశీలించి తెలుసుకోవాలి. ఆహార పదార్థాలు, పళ్ళు ఫలాలు, ఇతర తినుబండారాలు కొరికినప్పుడు మానవుని నోటిలో స్రవించే లాలాజలం కూడా వాటి మీద పడడం సహజం. నేరం జరిగిన ప్రదేశాలలో పడిన ఉమ్మిని సేకరించి పరిశోధన చేస్తారు.

ఆధునిక యుగంలో రకరకాల ప్రమాదాలు జరుగుతున్నాయి. ఉన్నట్టుండి ఇళ్ళు, భవనాలు, ఫ్లాటులు కూలిపోతున్నాయి. వాయు విమానాలు పడిపోతున్నాయి. బాంబులు ప్రేలుతున్నాయి. పారిశ్రామిక సంస్థలలో కాలుష్యాలు ఏర్పడుతున్నాయి. మంటలు, ప్రమాదాలు సంభవిస్తున్నాయి. కాల్పులు, దోపిడీలు, దారి మళ్ళింపులు మొదలైన అనేక రకాల ప్రమాదాలు ఏర్పడుతున్నాయి. ఇటువంటి ప్రమాదాలలో చిక్కుబడిన వ్యక్తుల శరీరంలో కణజాలాలు అన్నీ పూర్తిగా నశిస్తాయి. వ్రేళ్ళమీది గీతలు, గుర్తులు పోతాయి. రూపు రేఖలు మారిపోతాయి. ప్రమాదంలో చిక్కిన మనిషి మరణించిన తరువాత చాలా రోజులకు లభించిన మృత కళేబరంలో కణజాలాలు గుర్తు పట్టడానికే వీలులేకుండా నశించి పోతాయి. వ్యక్తిని గుర్తుపట్టడమే ఒక బ్రహ్మాండమై పోతుంది. ఇటువంటి పరిస్థితులలో బాధితుల నోటిలో పంటితీరు నిర్మాణం, దవడల ఏర్పాటుబట్టి వ్యక్తిని అతి సులభంగా గుర్తు పట్టవచ్చు వీటిని సరిపోల్చి పరిశీలించడానికి

## దీనివల్ల ఎవరికైనా లాభం ఉంటుందా?



నేను మీకు ఒక తాయెత్తు ఇస్తాను.... కు తటస్థపడిన ఒక దీనుని జ్ఞాపకం చేసుకోండి. మీరు చేపట్టిన ఉద్యమం ఆ దీనుడికేమైనా ఉపకరిస్తుందా? దీనివల్ల అతడికి ఏదైనా లాభం ఉంటుందా? అని మీలో మీరు వితర్కించుకోండి. దీనివల్ల అతని జీవితంలో మార్పు వస్తుందా? అతడికి అదృష్టం పడుతుందా? అంటే ఆధ్యాత్మిక చింతనలేని లక్షలాది ప్రజలకు స్వరాజ్యాభిమానం కలుగుతుందా? స్వరాజ్యాభిమానం కలిగినప్పుడు మీకు సంశయాలే ఉండవు.

గాంధీజీ

---

"ఒకరు చేసే ప్రతి పని మాట్లాడే ప్రతి మాట, చేసే ప్రతి ఆలోచన ఇతరులకు ఉపయోగపడితే అది రాజయోగ సాధన."

ముందుగా వీటి రికార్డులు తయారుచేసి ఉంచాలి.

అభివృద్ధి పొందిన వర్ధమాన దేశాలలో దంతవైద్యులు తమ వద్దకు వచ్చిన రోగుల దంత నిర్మాణం, దంతలతీరు, ప్లాస్టర్ మోడల్స్, ఫొటోగ్రాఫులు, దంతాల ఎక్స్‌రే ఫొటోలు మొదలైన వివరాలతో కేస్ షీటు లను భద్రపరుస్తారు. ప్రమాదాలకు గురి అయినవారి నోటి, ముఖ వివరాలు ఈ రికార్డుల వివరాలతో సరిపోల్చి సులభంగా గుర్తించగలుగుతారు. కాబట్టి ఇటువంటి కేసుషీటులు చాలా ఉపయోగపడతాయి. ముఖ్యంగా వాయు విమానాలు కూలిపోయి ప్రమాదాలు సంభవించినప్పుడు అందులో బాధితులను గుర్తుపట్టడానికి వారి నోటిపండ్లు తీరే సరి అయిన నిదర్శనాన్ని ఇస్తుంది.

ఇట్టి పరిస్థితులు ఏర్పడగలవని నేటి పరిశోధక బృందానికి చెందిన ఒడోన్‌టాలజిస్టులు (దంత శాస్త్రజ్ఞులు) ముందుగానే పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలోను, సంస్థలలోను పనిచేసే ఉద్యోగస్థులయొక్క, కార్మికుల యొక్క నోటి నిర్మాణపు తీరును రికార్డుచేసి ఉంచాలని ఆదేశిస్తున్నారు.

ఇన్సూరెన్స్ క్లెయిములలో ప్రమాదాలకు ముందు తయారుచేసి ఉంచిన రికార్డులవల్ల ఇన్‌ఫారెడ్, అల్ట్రావైలెట్ ఫొటోలు వగైరాలను పరిశీలించి క్లెయిములను సులభంగా, సక్రమంగా పరిష్కారం చేయవచ్చు.

అంతర్జాతీయ గూఢచారులు మొదలైనవారు తమ సహజ రూపాలకు మార్పులు కలిగించుకోడానికి కృత్రిమంగా తగిలించుకున్న పళ్ళను, ఇతర మార్పులను ఇన్‌ఫ్రారెడ్ మరియు అల్ట్రావైలెట్ ఫొటోల వల్ల తెలుసుకోగలుగుతున్నారు.

దంతాలకు సంబంధించిన రికార్డులు ముఖ్యంగా ఈ క్రింది వివరాలతో ఉండాలి.

1. నోటిలో పళ్ళు, ఇగుళ్ళు, దవడలు మొదలైనవాటి పూర్తి వివరాలు.

2. ఫొటోగ్రాఫులు - ఒక్కొక్క వ్యక్తి ముఖం ముందు వెనుక ప్రక్కల ఫొటోలు.

3. పళ్ళయొక్క ప్లాస్టర్ మోడల్సు తయారు చేయాలి.

4 ఎక్స్‌రే ఫొటోలు చాలా ముఖ్యం. దంతాలకు సంబంధించిన ఎక్స్‌రే ఫోటోలు దంతముల మూలములు, వాటి నిర్మాణ విధానం తెలియజేస్తాయి.

ఈనాడు దంతాలకు సంబంధించిన రికార్డులు చాలా సులభంగా తయారు చేయవచ్చు. ప్రతివ్యక్తి తన దంతాల రికార్డును తయారు చేయించుకోడం చాలా అవసరం

---

(50 వ పేజీ తరువాయి)

మిరాజ్ 2000 ఫైటర్ ఎయిర్‌క్రాఫ్టులను సరఫరా చేసింది. ఈ ఎయిర్ క్రాఫ్టు అధునిక ఇంటర్నల్ మౌంటెడ్ ఇంటలిజెన్స్ గేదరింగ్ (ESM) పరికరాలు, ఆక్టివ్ జామ్మింగ్ ఎలక్ట్రానిక్ (ECM) పరికరాలు కలిగి ఉంటాయి ఇవి గంటకు 2,495 మైళ్ళ వేగంతో నాలుగు నిమిషాలలో 49 000 అడుగులు, అత్యధికం 65,000 అ. వరకు పైకి పోగలవు.

"మానవుని శక్తి సంపన్నతను గుర్తించి గౌరవించుట
దేవుని దర్శించి పూజించుట వంటిది."

# మన ఆదిమజాతులు

## కొరవలు

కొరవలు తమిళనాడులో అనేక జిల్లాలలో నివసిస్తున్నారు. ప్రాచీనకాలంలో తమిళ దేశంలో కురునిలం అనే కొండజాతులను కురు



వర్ లేక కుఱవర్ అనేవారు. కురవ సాంప్రదాయం మురుగ సాంప్రదాయానికి సంబంధించినది. "మురుగ" తమిళుల వీరదైవం. వల్లీ అనే కురవ కన్యను పెళ్ళిచేసుకుంటాడు.

సుబ్రహ్మణ్యస్వామినే మురుగ అంటారు. మురుగ కొండదేవుడు. అందువల్లనే సుబ్రహ్మణ్య దేవాలయాలు సాధారణంగా కొండల మీద నిర్మింపబడ్డాయి. పూర్వం ఒకప్పుడు 'కోరమండలం', 'కోరనాడు' అనే ప్రదేశాలు ఉన్నట్టు తెలుస్తుంది. తమిళనాడు స్త్రీలకు 'కొరనాడు' చీర కట్టడం అంటే పెద్ద గొప్ప గౌరవ సూచకంగా ఉండేది. ప్రసిద్ధిపొందిన కోరమాండల్ తీరం బహుశః కోరమండలమే అయి ఉండాలి. కొరవ అనేది మధ్యప్రదేశ్ కొండ జాతులలో ఒక జాతి పేరు. ఉత్తర ఇండియాలో 'కొరియా' అనే ప్రదేశం కూడా ఉంది. 'కోర' అంటే సూర్యుడు. పూర్వం తమిళనాడు తూర్పుతీరంలో సూర్య మతం, సూర్యోపాసన చాలా ప్రసిద్ధి పొందింది.

వీళ్ళు కొరవలైనా, కురవలైనా ఈజాతి

### లోక్‌సభ ఎన్నికలకు రూ. 100 కోట్లు వ్యయం

1984 లోక్‌సభ ఎన్నికలకు (8వ జనరల్ ఎలక్షన్స్) రమారమి రూ. 100 కోట్లు ఖర్చు అయింది. ఇది ఓటర్ల జాబితాలు తయారుచేసి ఎన్నికలను నిర్వహించడానికి 1980వ సం. లో అయిన రూ. 55.97 కోట్లకు సుమారు రెట్టింపు.

"ఒకరిని నొప్పించక తాను నొవ్వక సమయానికి
తగినట్లుగా మాటలాడువాడు ధన్యుడు."

ఒకప్పుడు చాలా భాగ్యవంతమైన జాతి. 'నాడు' లేక 'మండలం' అనేది వారి రాజకీయ ప్రాముఖ్యతనుకూడా తెలియజేస్తూంది. తీర ప్రదేశాలలోను, దేశంలోపలి ప్రదేశాలలోను గాడిదలమీద సరకులను మోసుకుపోతూ వీరు అనేకరకాల వ్యాపారం ముమ్మరంగా సాగించేవారు.

వ్యాపార రీత్యా వీరు అనేక ప్రదేశాలు సందర్శించడం వల్ల వీరికి ఆయా ప్రదేశాలలో వివిధ నగరాలు, ఊళ్ళు, గ్రామాలతో బాగా పరిచయం ఏర్పడింది. వృత్తి వ్యాపార నైజంవల్ల వీరికి జనబాహుళ్యంతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. అందువల్ల ఆనాడు రాజులు, ప్రభువులు వీరిని గూఢచారులుగా నియోగించుకున్నారు. తమిళ భాషలో 'కురు' అనే మాటకు 'చెప్పడం' అనే అర్థముంది. కాబట్టి కురువాన్ అనేమాట కొరవన్‌గా మారి ఉండాలి.

తరువాత టిప్పుసుల్తాను వీళ్ళను తన రాజ్యంలో గూఢచారులు (వేగులు) గా నియమించి వీరికి దొంగతనాలు చేయడం, దారిదోపిడి చేయడం, కొల్లగొట్టడం నేర్పించి శత్రుసైన్యాల మీదికి పంపి వారి రహస్యాలను తెలుసుకొనేవాడు.

ఈ కురవలు అతి నియమంగా, నిష్ఠగా తమ జాతికి వృత్తిధర్మమైన నేరప్రవృత్తిని క్రమబద్ధం, నైపుణ్యవంతం చేసుకున్నారు. కాలక్రమేణ నాగరికత అభివృద్ధి పొందింది. ఆధునిక ప్రయాణ సౌకర్యాలు ఏర్పడ్డాయి. వ్యాపార రీతులు, విధానాలు మారాయి. దీంతోబాటు కొరవల సాంప్రదాయికవృత్తిలో కూడా మార్పులు ఏర్పడ్డాయి. ఈ కొరవలు దొంగతనం, దోపిడీ వృత్తిగా చేసుకుని దాన్ని ఒక ప్రత్యేక కళగా అభివృద్ధి పరచుకొని జీవించేవారు.

కొరవలు తమిళం (అరవం) భాష మాట్లాడుకుంటారు ఆదిమవాసులుగా పరిగణింపబడినా వీరు తమిళజాతికి చెందినవారే. ఇండియా బ్రిటిషు పరిపాలనా కాలంలో వీరిది నేరస్థుల జాతిగా గుర్తించబడింది. వీరు నైపుణ్యంగా, క్రమబద్ధంగా కన్నాలు వేయడం, కొల్లగొట్టడం, దొంగతనాలు, దారిదోపిడీలు చేయడం అందరికీ తెలిసిన విషయమే. కాని ఈ దోపిడీ విధానంవల్ల లభించిన సొమ్ము గ్రామాలలోను, పట్టణాలలోను కొంతమంది పెద్దలకు మాత్రమే చేరేది.

కాలం గతిస్తున్న కొద్దీ వీరి జీవిత విధానంలో కూడా మార్పులు వచ్చాయి. సహజంగా లోకజ్ఞానం, వివేకం గల కొరవలు ఈనాడు అందరితోపాటు సమానంగా జీవిస్తున్నారు. ప్రత్యేకంగా ప్రభుత్వం వీరిని మంచి పౌరులుగా వర్గీకరించడానికి తగిన సాధన సదుపాయాలను కలిగిస్తున్నారు.

---

## దృష్టి పరిమితి 18 అక్షరాలు

ఎంత వేగంగా చదువగలిగినా, మనకన్ను ఒకసారి అత్యధికం 8 అక్షరాలు మాత్రమే చూడగలదు. దృష్టినాభి (Focal point) కేంద్రానికి ఎడంప్రక్క 4 అక్షరాలు, కుడి ప్రక్క 14 అక్షరాలు మాత్రమే అని అమెరికా మెసాచూసెట్స్ యూనివర్సిటీ మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

# హాబీగా భాషలు నేర్చుకోండి

స్టీఫెన్ లిన్

అనేక రకాలు. కొంతమంది స్టాంపులు చేర్చిపెడతారు. కొంతమంది గ్రీటింగు కార్డులు చేర్చిపెడతారు. రకరకాల



దేశదేశాల నాణేలు సంగ్రహిస్తారు. అగ్గిపెట్టెలమీది బొమ్మలను మరికొందరు కూడబెడతారు. అయితే హాబీగా వివిధ భాషలను కూడా నేర్చుకోవచ్చు.

ఒక క్రొత్త భాష నేర్చుకోడం అంటే ఎంతో ఉల్లాసంగా ఉంటుంది. దానివల్ల ఎన్నో లాభాలు కూడా. క్రొత్త భాషలు క్రొత్తగా ఉంటాయి కాబట్టి నేర్చుకోడానికి కుతూహలంగా ఉంటుంది. ఈ విధంగా నేర్చుకునేటప్పుడు ఒక క్రొత్త భాషనే కాదు. క్రొత్త సంస్కృతిని కూడా పరిచయం చేసుకుంటాం. క్రొత్తవాళ్ళతో మంచి చెడ్డలు మాట్లాడుకోడానికి వీలవుతుంది. ప్రపంచ జ్ఞానం ఎక్కువ అవుతుంది.

క్రొత్త భాష నేర్చుకోడం వల్ల అనేక లాభాలు. క్రొత్తభాషలో గ్రంథాలు, నవలలు చదువుకోవచ్చు. దేశదేశాలలో కలం స్నేహితులు ఏర్పడతారు. ఇంతేకాదు. రెండుమూడు భాషలు బాగా వచ్చినవారికి ఉద్యోగావకాశాలు

## పాఠకుల అభిప్రాయాలు

(నవంబరు 1985)

"వెన్న కరిగితే వేడికి నిదర్శనం
మనసు కరిగితే మానవతకు
నిదర్శనం."

—బి. ఎస్. వి. జి. రాజా, జేకేపూర్,
(ఒరిస్సా).

* * *

"నాటి వివేకానందుని ఆశయాలు
నేటి అవివేకానందులకు ఆలయాలు."

—బి. శ్యామసుందరమూర్తి, ఖమ్మం.

* * *

"ఎవరో వస్తారని, ఏదో చేస్తారని
ఎదురు చూపి మోసపోకు,
నీ బ్రతుకుబాటను నువ్వే 'పూల
బాట' చేసుకో!"

—గుడ్ల సంజీవరావు, కళ్యాణసింగుపురం,
(ఒరిస్సా)

"విధి విరీతము మించి ఏదియు గలుగదు."

అధికంగా ఉంటాయి. కావ్యాలకూ, గ్రంథాలకూ వ్యాఖ్యానాలు చేయవచ్చు. అర్థాలు చెప్ప



వచ్చు. ఒక భాషనుంచి మరో భాషలోకి భాషాంతరీకరణం చేయవచ్చు. విదేశీ భాష నేర్చుకోడంవల్ల విదేశాలలో ఉద్యోగాలు లభిస్తాయి. విదేశీ ప్రయాణాలు అతి సులభంగా కొనసాగుతాయి. భారతీయ భాషలు నేర్చుకుంటే భారతదేశంలో ఏ మూలకైనా మనం ప్రయాణంచేసి గెలుచుకురావచ్చు.

ఈ హాబీకి ముఖ్యంగా రెండు మార్గాలు ఉన్నాయి. మొదటిది: దైనందిన వ్యవహారాలు జరుపుకోడానికి వీలుగా అనేక భాషలు మాట్లాడి అర్థం చేసుకోడం ఒక విధం. రెండు, మూడు భాషలు కేటాయించుకుని వాటిని క్షుణ్ణంగా అధ్యయనంచేసి వాటిలో ప్రావీణ్యత సంపాదించుకోడం రెండవ విధానం.

ఏ భాష ముందు నేర్చుకోవాలి? మొట్టమొదట మాతృభాషకు అతి సన్నిహితంగా ఉండే భాషను నేర్చుకోడానికి ప్రయత్నించాలి. ఉత్తర హిందూస్థానంలో ఉండేవారు మరాఠీ నేర్చుకుంటే దక్షిణాదిని ఉండే తమిళులు, కన్నడంగానీ మలయాళంగానీ నేర్చుకోవచ్చు. విదేశీ భాషలలో ఫ్రెంచి నేర్చుకోడం చాలా సులభం. ఇది ఆంగ్ల భాషకు అతి సన్నిహితంగా ఉంటుంది కాబట్టి.

మీ ఇరుగు పొరుగున మాట్లాడే లేక నేర్పే భాష నేర్చుకోడం మంచిది. ఒక క్రొత్తభాష నేర్చుకునేటప్పుడు ఆ భాషకు సంబంధించిన వ్యాకరణ సూత్రాలు, మాటలు, వాక్యాలు నేర్చుకుంటే చాలదు. ఆ యా భాషలు ఉచ్చారణ దోషంలేకుండా మాట్లాడడానికి, ఆ భాషలో గ్రంథాలు తడుముకోకుండా చదివి అర్థంచేసుకోడానికి అభ్యాసం చేసుకోవాలి.

భాష నేర్చుకునే రీతి కూడా చాలాముఖ్యం. ఈనాడు క్రొత్తభాషను నేర్చుకోడానికి బాగా అభివృద్ధిపొందిన విధానం భాషా పరిశోధక శాలలు (Language Laboratory). దీని అవకాశం మీ ఊళ్లో ఉండకపోవచ్చు. అలాంటప్పుడు దృష్టశ్రవ్య విధానం (audio-visua courses) అవలంబించాలి. ఇవి పెద్ద పెద్ద నగరాలలో చాలా చోట్ల

---

## అంతరిక్షంలో 12 నిమిషాల పాటు ఉన్న తొలి వ్యక్తి

1965 వ సం.లో వోస్కోడ్ 2-వ్యోమ విమానంలో రష్యాకు చెందిన అలెక్సి లియోనోవ్ తొలిసారి అంతరిక్ష ప్రయాణం చేశాడు. అంతరిక్షంలో ప్రవేశించి అక్కడ 12 నిమిషాలపాటు ఉన్న తొలి వ్యక్తి ఇతడే.

"దానబుద్ధి గలవానికి సత్యబుద్ధి లేనిచో మాట విలకడ ఉండదు."

ఉన్నాయి. ముఖ్యంగా విదేశీభాషలు నేర్చ వారికి ఈ విధానం అవలంబిస్తారు. కొన్ని చోట్ల భారతీయ భాషలకు కూడా ఈనాడు ఈ అవకాశం ఉంది. దృశ్య శ్రవ్య విధానంలో ఫిల్ములు, టేపులు ఉపయోగిస్తారు ఇది కొంచెం ధనవ్యయంతో కూడినా చాలా ప్రయోజనకరం. ఎంతో స్వారస్యం.

దృశ్య శ్రవ్య విధానం కూడా మనకు అందుబాటులో లేకపోతే సాంప్రదాయక విధానం అవలంబించాలి. మొట్టమొదట ఆ భాషకు చెందిన వ్యాకరణం. వాక్యాలు, మాటలు నేర్చి వ్యాకరణంలో సాధకాలు, అభ్యాసాలు చేయాలి. సాధ్యమైతే ఉపాధ్యాయుని ద్వారా క్రొత్త భాషలు నేర్చుకోడం ఉత్తమం. మార్కెట్‌లో విరివిగా లభిస్తున్న స్వబోధినులు అంత ఉపకరించవు. ఇవి వివరణాత్మకంగా ఉండవు. భాష నేర్చుకునే కోర్సు పూర్తి అయిన తరువాత విడువకుండా అభ్యాసం చేస్తూ ఉండాలి

ఆయా భాషను మాట్లాడే స్థానిక వ్యక్తులతో సంబంధాలు పెట్టుకుని వారితో మాట్లాడవచ్చు. ఆ భాషను మాట్లాడే కలం స్నేహితులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవచ్చు. లేకపోతే ఆ భాషలో ప్రచురించబడే నవలలు, పత్రికలు చదవవచ్చు. వీలుగా ఉంటే మూడు విధాలు కూడా అనుసరించడం మంచిది.

## జీవితంలో ప్రతీ సమస్యకి పరిహారం ఉండే ఉంటుంది



నిరాశ చెందకుండా ఉండాలంటే—

1. ప్రతీ సమస్యకి దాని పరిహారం దానికి ఉండనే ఉంటుంది. సమస్యకు తగిన పరిష్కారం లభిస్తుంది. దీనివల్ల విశ్వాసం, జ్ఞానం, గౌరవం పెంచుకోగలుగుతాం.

2. చాంచల్యం భావం ఉండకూడదు తటపటాయించకూడదు. కృత నిశ్చయం చేసుకోవాలి. వెంటనే ఆచరణలో పెట్టాలి.

3. జీవితంలో అపజయాలకు క్రుంగిపోకుండా జరిగిన మంచిని గ్రహిస్తే ఎంతో లాభాన్ని పొందగలం

4. సత్ఫలితాలను మాత్రమే గ్రహించాలి. అందుచేత జీవితంలో వాస్తవంగా సాధించుకోవాలన్న లక్ష్యాలకు తీవ్రంగా పాటుపడగలుగుతాం.

5. సామర్థ్యాలను సంగ్రహించుకోవాలి. కాయశక్తులా అన్ని లక్ష్యాలను సాధించగలుగుతాం. ఎట్టి పరిస్థితులలోను నైరాశ్య భావానికి లొంగిపోకూడదు.

6. చేతకాదు అనే భావాన్ని మనస్సులో చేరనీయకూడదు. 'చేయగలను, చేస్తాను' అనే ధీమా ఏర్పడాలి.

('సైకాలజిస్టు' మాగజైన్ సౌజన్యంతో).

"ప్రేమలేని హృదయం చీకటికొంప వంటిది."

# బహుమతి పొందిన వ్యాసం

## విద్యార్థులలో విద్యాప్రమాణాలు పెరగాలంటే?

ఎమ్. ఎస్. సత్యనారాయణమూర్తి,
కళింగపట్టణం.

ఈనాడు విద్యా ప్రమాణాలు రోజు రోజుకీ మరీ దిగజారిపోతున్నాయి. విద్యార్థులలో విద్యాప్రమాణాలు క్షీణించిపోవడానికి విద్యార్థులలో విద్యాభ్యాసంపట్ల శ్రద్ధాశక్తులు లేకపోవడం, సమర్థులైన అధ్యాపకులు లేకపోవడం, ఉన్న ఒకటీ అరా విద్యావంతులు, మేధావులు స్వదేశంలో ప్రోత్సాహం లేక విదేశాలకు వెళ్ళిపోవడం, పాఠ్య ప్రణాళికలు లోపభూయిష్టంగా ఉండడం, విద్యాలయాలకు వసతి సౌకర్యాలు లేకపోవడం, ఉపాధ్యాయ విద్యార్థుల నిష్పత్తి సక్రమంగా లేకపోవడం మొదలైనవి అనేక కారణాలున్నాయి. సమ్మెలు, ఘెరావులూ చేసి విద్యార్థులు క్షణికోద్రేకంతో ఆత్మద్రోహం చేసుకుంటున్నారు.

ఈనాటి పరీక్ష విధానాలు నిర్దుష్టంగాలేవు. అవి చాలా వరకూ విద్యార్థి జ్ఞాపకశక్తినే పరీక్షిస్తున్నాయి తప్ప, విద్యార్థి జ్ఞానాన్ని, నైపుణ్యాన్ని పరిగణించడం లేదు. 'నాన్ డిటెన్షన్' విధానంవల్ల విద్యార్థులు చదువులు ండా పైతరగతులకు వెళ్ళిపోతున్నామని తాత్కాలికంగా సంబరపడి పోతున్నారు.

తక్కిన రంగాలలాగే విద్యారంగం కూడా

---

## ప్రపంచంలో అత్యాధునికమైన ప్రయాణ సాధనం



ప్రపంచంలో అత్యాధునిక ప్రయాణ సాధన విధానం ఎమ్. డి. హెచ్. హోవర్ ట్రెయిన్ (M.D.H hover train). దీన్ని పశ్చిమ బెర్లిన్‌లో గ్లెస్ డ్రీక్ స్టేషనులో ప్రత్యేక 600 మీటర్ల దారిమీద విజయవంతంగా నడిపించి చూస్తున్నారు. ఈ రైలు ఎంత మాత్రం రాపిడి (friction) లేకుండా మాగ్నెట్లమీద అతి నిశ్శబ్దంగా గంటకు 80 కి.మీ. వేగంతో పోతుంది.

"ఎవరి నీడలో వారు విశ్రమించలేరు."

అవినీతులకూ, లంచగొండితనాలకూ ఆల వాలమై గొప్ప వ్యాపారకేంద్రం అయి పోయింది. దీనికి తోడు రిజర్వేషన్ విధానాలు విద్యాప్రమాణాలను దిగజారుస్తున్నాయి.

పాలకులు విద్యా ప్రమాణాభివృద్ధి కార్య క్రమాలు ముమ్మరంగా చేపట్టాలి. అంతర్జాతీయ విద్యా సదస్సులకి మన మేధావులను పంపి ఆయా అగ్రరాజ్యాల విద్యా విధానాలను మన విద్యారంగాలలో ప్రవేశపెట్టాలి. మన విద్యావేత్తలకు ఆధునిక విద్యా విధానాల తర్ఫీదు ఇవ్వాలి. వ్యాపార సరళిలో స్వార్థ పరులు విద్యారంగాన్ని కలుషితం చేయకుండా చర్యలు తీసుకోవాలి. సత్ప్రవర్తనకూ, సంస్కారానికీ దారి చూపే విద్య నేర్పాలి. ఉపాధ్యాయ, విద్యార్థుల మధ్య ప్రమాణీకరించిన నిష్పత్తిని పాటించాలి. వృత్తివిద్యల ప్రోత్సాహంతో నిరుద్యోగ సమస్యలను నిర్మూలించాలి. విద్యార్థుల మనస్తత్వానికి సరిపడే విద్య నేర్చుకోడానికి అవకాశం కల్పించాలి.

ప్రియతమనేత శ్రీ రాజీవ్ సారథ్యంలో భారతీయ విద్యారంగం శోభితం అయి పటిష్ఠంగా అయ్యే శుభసూచనలు కానవస్తున్నాయి. అది సంతోషదాయకం.

* * *

పి. మోహన్, కోరుకొండ.

విద్యా వృత్తంలో నాలుగు సమకోణాలున్నాయి. విద్యార్థి, ఉపాధ్యాయుడు, తల్లిదండ్రులు, ప్రభుత్వం ఈ నాలుగూ సమిష్టి బాధ్యతతో పనిచేస్తే విద్యా ప్రమాణాలు పెరుగుతాయి.

విద్యార్థికి అభిరుచి ప్రధానం. అభిరుచిగల విద్యపై ఆసక్తి పెరుగుతుంది. ఆసక్తి అవధానాన్ని పెంచుతుంది. ఫలితంగా నైపుణ్యం అలవడి విద్యాప్రమాణాలు పెరుగుతాయి.

ఉపాధ్యాయుడు ముందు తాను చెప్పబోయే అంశంపై, బోధనాపద్ధతిపై, పరిగణ

## 2,300 సం.ల నాటి మాగ్నటిక్ ఐరన్ గేటు



చైనాలో బైజింగ్ సమీపంలో ఓఫాంగ్ రాజభవనానికి 2,300 సం.ల పూర్వం అయస్కాంతపు ద్వారం ఏర్పాటు చేశారు. దొంగచాటుగా ఆయుధాలను, ఇతర లోహపు వస్తువులను తీసుకుపోయే వ్యక్తిని ఇందలి కాంత శక్తి ద్వారం దగ్గర ఆటంకపరచి నిలుపు చేస్తుంది. అభివృద్ధిపొందిన దేశాలలో అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన ఎలక్ట్రానిక్ కన్ను (Electronic eye) లా ఓఫాంగ్‌లోని మూన్‌గేట్ పని చేసింది.

---

"ఇతరుల ఐశ్వర్యానికి సహకరించువాడే ఆదర్శవాది." — హెన్రిఫోర్డ్.

నపై సదవగాహన పెంపొందించుకోవాలి. దీని ఫలితంగా లేత మనస్సుల అభీష్టాల మేరకు తెలిసినదానినుండి తెలియనిదానికి అనుమానోత్పత్తి ద్వారా బోధించి విద్యార్థుల విద్యా ప్రమాణాలు పెంచవచ్చు.

తల్లిదండ్రులు తమ చిరంజీవుల ఉత్తీర్ణతను మాత్రం చూస్తున్నారు. పోటీ ప్రపంచంలో తట్టుకుని తమ కుర్రవాడు ఉద్యోగం సంపాదించుకోవాలనే ఉత్కంఠతతో విద్యా ప్రమాణాల పెరుగుదలకు ఆటంకాలు కలిగిస్తున్నారు. 'పాస్' పైపుగాక వివేకంపైపు వారి బుద్ధి ప్రసరిస్తే విద్యా ప్రమాణాలు పెరుగుతాయి.

ప్రభుత్వం విద్యార్థుల స్థానిక వాతావరణాన్ని జీవితానికి దగ్గరైన విద్యను, తగిన విద్యా విషయిక వనరులను, సరైన మూల్యాంకన విధానాన్ని కల్పించాలి. నూతన విద్యా ప్రణాళికను అనుభవనీయ ఉపాధ్యాయులచే నిర్మింపజేసి సక్రమంగా అమలు జరపాలి.

* * *

కె. శిశిర్ కుమార్, కూచిపూడి.

విద్యా ప్రమాణాలకీ, విద్యా విధానానికీ అవినాభావ సంబంధం ఉంది. విద్యా ప్రమాణాలు పెరగాలంటే ఈనాటి విద్యా విధానాన్ని పూర్తిగా రద్దుచేసి శాస్త్రీయమైన విధానాన్ని రూపొందించుకోవాలి.

విద్యా విధానం రూపొందించుకునేముందు మనదేశంలోని ప్రజల ఆర్థిక, సాంఘిక, రాజకీయ నైతిక పరిస్థితులను కూలంకషంగా అర్థం చేసుకోవాలి. ఆ తరువాత ఆయా ప్రాంతాలలో, ఆయా భౌగోళిక పరిస్థితులలో ఎటువంటి విద్య ఆ ప్రాంతంలోనివారికి స్వయం ఉపాధి కల్పించగలదో పరిశీలించి ఆయా కోర్సులను ప్రారంభించాలి. ఇటువంటి విధానంలో విద్యార్థులు తమకు నిజంగా అభిరుచి ఉన్న కోర్సులలో చేరతారు కనుక విద్యా ప్రమాణాలు స్వచ్ఛందంగానే పెరుగుతాయి.

ఉద్యోగం కోసం మాత్రమే వీరు చదవడంతో ఏదో ఒక రకంగా డిగ్రీని సంపాదించుకుంటారు. సిలబసును పెంచి పరీక్షా విధానాలను మార్చడంవల్ల విద్యా ప్రమాణాలు పెరుగవు. ఉద్యోగాలకు, డిగ్రీలకూ సంబంధం లేకుండా చేయడం ద్వారా విద్యా ప్రమాణాలను పెంచవచ్చు. దేశ వ్యాప్తంగా విద్యా విధానంలో మౌలిక మార్పులు తేవాలని ప్రధాని రాజీవ్ ప్రయత్నిస్తున్నారు. అయితే దేశంలోని సాంఘిక, ఆర్థిక, నైతిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకోకుండా నిర్ణయించే విద్యా ప్రమాణాలు పెరగడం అసాధ్యం

(2వ పేజీ తరువాయి)

## అతి సామర్థ్యవంతమైన

కాలిఫోర్నియాలో యునైటెడ్ స్టేట్స్ స్పేస్ ఏజెన్సీవారి అమెస్ పరిశోధక కేంద్రం 171 లక్షల డాలర్ల వ్యయంతో ప్రపంచంలోనే అతి సామర్థ్యవంతమైన సూపర్ కంప్యూటర్‌ను ఏర్పాటు చేయబోతున్నారు. ఇది సెకండుకి 10 బిలియన్ల వివిధ కాంప్యుటేషనులను చేయగలుగుతుంది.

# వీరిని గురించి తెలుసుకోండి

జోహాన్ సెబాస్టియన్ బాచ్:

సుమారు 300 సం.కు పూర్వం సుప్రసిద్ధ జర్మన్ గేయ రచయిత అతి విస్తృతంగా



వివిధ రీతులలో అనేక గేయాలను జర్మన్ భాషలో రచించి సంగీతవంశాన్ని స్థాపించిన మహనీయుడు. ఫ్రెంచి గాయకుడు రచయిత అయిన క్లాడే డెబుస్సీ ఈతనిని సంగీతాధి దేవతగా పేర్కొన్నాడు.

* * *

పోతులూరి వీరబ్రహ్మం:

పోతులూరి వీరబ్రహ్మం 17 వ శతాబ్దం మొదటిభాగంలో జీవించిన సంసారియైన గొప్ప యోగసిద్ధుడు. ఈతడు విశ్వబ్రాహ్మణ కుటుంబానికి చెందిన కాలజ్ఞాన బోధకుడు. అనేక తత్త్వాలను రచించాడు. జరిగిన దానిని జరుగబోవునదిగా చెప్పి తన కాలమును తానే వెనుకకు ఈడ్చుకొనుట 'కాలజ్ఞానం.' ఇతడు ప్రచారం చేసినది అచలమతం. శివ విష్ణు దేవతా భేదాలనుగానీ, హిందూ, మహమ్మదీయ మత భేదాలనుగానీ, కులభేదాలనుగానీ పాటించక సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని బోధించి ఆచరణలో పెట్టించాడు. ఇతడికి ప్రీతి పాత్రుడైన శిష్యుడు దూదేకుల పీర్ సాహెబు. ఇతడే దూదేకుల సిద్ధప్ప. వీరి రువురి సంబంధాన్నిబట్టే 'బ్రహ్మంగారి వంటి గురువు లేడు. సిద్ధయ్యవంటి శిష్యుడులేడు' అనే లోకోక్తి కూడా ఏర్పడింది.

## భావపరిచయ పోటీ

(నవంబరు 1985)

"వ్యక్తిత్వంలో లేదు లోపం
పెంపకంలో ఉంది కిటుకు"

—ఎ. ఉమారాణి పుల్లూరు.

"చిన్నప్పుడు ముద్దులు చేస్తే
పెద్దయ్యాక హద్దులు తెలియవు."

—శ్రీమతి పొడుగు సర్వలక్ష్మి,
విశాఖపట్టణం.

* * *

"మొక్కై వంగనిది
మ్రానై వంగుతుందా!"

—ఎన్. సదానందం, పెద్దాపురం,
(కరీంనగర్ జిల్లా.)

"ఒక చిన్నపక్షి ఎంత చిన్నదైనా దాని గూడు అదే నిర్మించుకుంటుంది."

డా. పి. కె. సేతి:

'జైపూర్ ఫుట్' అనే కృత్రిమ పాదాన్ని అభివృద్ధిపరచి కాలులేనివారికి కాలు ప్రసాదించిన ఘనుడు. ఈతడి ఈ వైజ్ఞానిక సాధనకు 'మాగ్‌సేసే' అవార్డును, 'గిన్నెస్' అవార్డును కూడా బహూకరించారు.

* * *

సరోజినీనాయుడు (1879-1949):

గొప్ప శాస్త్రవేత్త, విద్యావేత్త అగు అఘోరెనాథ్ చటోపాధ్యాయ కుమార్తెగా వంగజాతిలో జన్మించి, ఆంధ్రుల కోడలు అయిన సరోజినీనాయుడు అసామాన్య ప్రతిభావంతురాలు. మహిత సుందరభావుకురాలు, సత్య మానవతావాది. గొప్ప వక్త్రి. సాటిలేని రాజకీయవేత్త. ఈమె వివాహం ఆంధ్ర వంగజాతులకు వియ్యమును కూర్చిన ఆదర్శ వివాహం. సుప్రసిద్ధ రచయిత్రిగా ప్రారంభించిన ఈమె తన జీవితాన్ని భారత దేశ స్వాతంత్ర్య సమరానికి ధారపోసింది. ఈమె 14 వ సం.లోనే ఆంగ్లేయ కావ్యాలను పూర్తిగా అధ్యయనంచేసి ఆంగ్లభాషలో అనేక రచనలు రచించింది.

* * *

హెన్రీఫోండా:

ప్రసిద్ధ సినీమానటుడు. 'ఆన్‌గోల్డెన్ పాండ్'లో ఉత్తమనటుడుగా 1982వ సం. పు ఆస్కార్ అవార్డును పొందాడు. 'ది లేడీ ఈవ్'లో హ్యుజ్‌కిన్‌సన్, 'ఫోర్ట్ అపాచీ'లో ఓల్లీ హర్డినెట్, 'వన్స్ అపాన్ ఏటైమ్ ఇన్ ది వెస్ట్'లో ఫ్రాంక్ బ్రాండిట్ లీడర్‌గాను నటించాడు. ఇతడు ఆగస్టు 12, 1982 లో మరణించాడు.

డా. సలీమ్ అలీ:

ప్రపంచంలో ప్రసిద్ధిపొందిన పక్షుల జీవితాలను అధ్యయనం చేసిన ఆర్నిథోలోజిస్టు. 14 అవార్డులను గెలుచుకున్న నైపుణ్యశాలి. ఇతడు ఎస్. డిల్లాన్ రిప్లేతో చేరి రచించిన భారతదేశపు మరియు పాకిస్తాన్ పక్షులు (Handbook of the birds of India and pakistan) అనే గ్రంథం అత్యంత అమూల్యమైనది.

---

(19 వ పేజీ తరువాయి)

వారికి పట్టరాని సంతోషం కలిగింది. 6 సం రాల వయస్సులో పరారైన కుర్రవాణ్ణి పది సంవత్సరాల తరువాత చూచి అమితమైన ఆనందంతో కౌగిలించుకున్నారు. ఏదేదో మాట్లాడాలని అనుకుంటున్నారు. ఈ ఆనందంలో ఆ తల్లి తిండిమాట మరచిపోయింది. నేను మెల్లిగా తప్పుకుని దూరంగా వెళ్ళాను.

సూర్యోదయం అయింది. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. ఆకుపచ్చని మైదానాలన్నీ బంగారంలాగా మెరిసిపోతున్నాయి. పది సంవత్సరాల తరువాత తమ కుమారుణ్ణి కలుసుకోగలిగినందుకు అతని తల్లిదండ్రుల ఆనందం నాకు మరపురాని సంఘటన. ఈనాడు ఆ నాగా బాలుడు రక్షక దళంలో ఒక సభ్యుడుగా ఉన్నాడు.

---

"మానవ హృదయాలకు ప్రేమ పువ్వులకు సూర్యరశ్మి వంటిది." —స్వామీ చిన్మయానంద

# నిజాలు - నిదర్శనాలు

## ప్రమాదాలు

**అత్యధికం:**

రోడ్డు ప్రమాదాలవల్ల కలుగుతున్న ఆర్థిక నష్టం సాలినా రూ. 350 కోట్లు పైబడే ఉన్నట్టు ఇటీవలి లెక్కలవల్ల తేలింది. ప్రతి 100 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో 16.85 ప్రమాదాలతో కేరళ ప్రథమస్థానాన్ని పొందుతూంది. మహారాష్ట్రలో ప్రతి లక్ష మందికి 83.72 ప్రమాదాలు జరగడం దేశంలోనే అత్యధికం. తమిళనాడులో ప్రతి 1,000 మోటారు వాహనాలకు ప్రమాదాల సంఖ్య అత్యధికం_64. మహారాష్ట్రలో ప్రతి 1000 కి.మీ. దూరానికి ప్రమాదాల సంఖ్య అత్యధికం_242.

* * *

## గ్రామీణ ప్రదేశాలలో రాకపోకలకు మూడింటికి రెండువంతులు ఎద్దు బళ్ళే:

నేటికీ దేశంలో గ్రామీణ ప్రదేశాలలో రాకపోకలకు 2/3 వ నంతు ఎద్దుబళ్ళే ప్రయాణ సాధనాలుగా వాడుతున్నారు. అని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ మేనేజిమెంట్ విభాగం సలిపిన సర్వే తెలియజేస్తూంది. దేశంలో మొత్తం 150 లక్షల ఎద్దుబళ్ళలో 120 లక్షలు గ్రామీణ ప్రాంతాలలో తిరిగేవే. వీటిని సంవత్సరంలో సుమారు 100 రోజులు మాత్రమే ఉపయోగిస్తారు. కాని పెద్ద పెద్ద పట్టణాలలో నూ, నగరాలలోనూ సంవత్సరానికి సుమారు 200 రోజులు, లక్షల ఎద్దుబళ్లు తిరుగుతూ ఉంటాయి.

## భారతదేశంలో 25 శాతం జనాభా పెరుగుదల



కుటుంబ నియంత్రణ ప్రణాళిక క్రింద ప్రభుత్వం ఎన్ని ఉద్యమాలు సాగించినా, ఎంత ఖర్చుచేసినా భారతదేశంలో జనాభా ప్రతీ సెన్సెస్‌కి (పదేసి సంవత్సరాలు) 25 శాతం పెరుగుతూనే ఉంది. 1951 సం. లో ఉన్న జనాభామీద 1961 సం. లెక్కల ప్రకారం పెరుగుదల 21.6 శాతం. 1971 సం.లో 24.8 శాతం మరియు 1981 సం.లో 25 శాతం పెరుగుదల సూచిస్తూంది.

"శరణుజొచ్చిన వారిని రక్షించుటకంటే
పుణ్యమైన కార్యం వేరొక్కటి లేదు."

## చైనాలో ఒకే సంతానంతో ఉండే కుటుంబాలు 350 లక్షలు:

ఈ నాడు చైనాలో సంతానాన్ని కనగల కుటుంబాలలో 21.2 శాతం ఏకైక సంతాన కుటుంబాలుగా ఉన్నాయి చైనా దేశంలో 10.000 లక్షల జనాభాలో పట్టణాలలో నివ పించే 8.000 లక్షల యువ కుటుంబాలలో ఏకైక సంతాన కుటుంబాలు ఎక్కువ.

* * *

## భారతదేశంలో 53 నేషనల్ పార్కులు:

1980 వ సం.లో 19 నేషనల్ పార్కులు, 205 సాంక్చ్యుయరీలు గల భారతదేశంలో ఈ నాడు 53 నేషనల్ పార్కులు, 247 సాంక్చ్యుయరీలు ఉన్నాయి. ప్రస్తుతం దేశంలో 3 శాతం భూభాగం పార్కులు, సాంక్చ్యుయరీలు ఆవరించాయి.

* * *

## భారతదేశం, అమెరికాల థోరియం నిలువలు:

ప్రపంచంలోనే భారతదేశంలోను, అమెరికాలోను థోరియం నిలువలు అత్యధికం— ప్రతి దేశానికి 3.2 లక్షల టన్నులు ఉన్నాయి. 1.6 లక్షల టన్నులు ఉన్న బ్రెజిల్, కెనడా ద్వితీయ స్థానాన్ని పొందుతున్నాయి. భారతదేశంలో ముఖ్యంగా కేరళలోను, తమిళనాడులోను సముద్రపు తీరాలలో మోనాజైట్ ఇసుకలో థోరియం నిల్వలు ఉన్నాయి.

---

## మానవ ప్రగతికి ధనం సహకరించదు!



"ఈ ప్రపంచంలో ఎంత శ్రద్ధాభక్తులతో ఉద్యమించే వారికైనా వ్యక్తిగత ప్రగతికి ధనం ఎంత మాత్రం సహకరించదనే మనో నిశ్చయానికి వచ్చాను. మహాత్ములైన ఆదర్శ పురుషుల జీవితాలే వ్యక్తిగత ఔన్నత్యానికి సహకరిస్తాయి. ధనం వల్ల దురభిమానం అభివృద్ధి పొందుతుంది. దురభ్యాసాలు అల వడతాయి; మోసెస్, జీసెస్, గాంధీ మొదలైనవారు ధనంతో విజయాన్ని సాధించలేదు.

—ఐన్‌స్టైన్

"మోక్షాసక్తులగువారు జ్ఞానము నాశ్రయించి సర్వత్ర సమదర్శనులై వర్తించి శాశ్వతానందాన్ని పొందగలరు."

# పెలికాన్-అద్భుతమైనపక్షి

ఆర్. ఎల్. ఖన్నా

పెలికాన్ ప్రపంచంలో అద్భుతమైన పక్షి. కథలలో, కావ్యాలలో వీటిని గురించి ఎంతో వర్ణించబడింది. పెలికాన్ సముద్రపు పక్షి



చాలా పెద్దది. గాన్నెట్, (gannet) ఫ్రిగేట్ పక్షి, (frigate bird) కోర్మోరాంట్ (cormorant) అంగ్నా (anghina), బూబీ (booby) పక్షులు మొదలైన పెలికాన్ ఫార్మెస్ (Pelecan formes) జాతికి చెందినది.

ఈ జాతిలో 50 రకాల పక్షులు జీవిస్తున్నాయి. ఇవి నీటిలో ఈదడానికి వీలుగా బాతు కాళ్ళలాగ కాలి వ్రేళ్ళు నాలుగూ చర్మంతో కలపబడి వుంటాయి. ఈ పక్షి జాతిని 'టోటిపాల్మేట్ స్విమ్మర్స్' (totipalmate swimmers) అంటారు. ఇతర టోటిపాల్మేట్ స్విమ్మర్స్ పక్షుల వలె గాక వీటి కాళ్ళ కుండే ముందు మూడు వ్రేళ్ళు, వెనుకటి వ్రేళ్ళూ అన్నీ చర్మంతో కలపబడి ఉంటాయి గొంతుకలో వీటికి పెద్ద పెద్ద సంచులుంటాయి. పెలికాన్ జాతి పక్షు లన్నిటికంటే పెలికాన్ పక్షికి ఈ సంచులు పెద్దవిగా ఉంటాయి. కొగాలనుల నీరు పట్టేటంత పెద్ద పెద్దవిగా

## జీవితంలో దుష్కర్మలు

అంతరంగ జీవితంలో అనవసరమైన చింత ఒకటి ముఖ్యంగా మనం చేసే చెడ్డపని. మనస్సులో ఏదో పనికిమాలిన యోచన బయలుదేరుతుంది. మనస్సుకు దానిని వదల్చుకునే శక్తి లేక అంతూపొంతూ లేకుండా అదే ఆలోచిస్తూంటుంది. ఇది ముఖ్యంగా మనస్సులో చెలరేగే చికాకు వల్ల, అనుమానాలు చోటుచేసుకోడం వల్ల ఏర్పడుతుంది. దీనివల్ల ఒకే విషయం గురించి మనస్సులో ఆందోళనతో ఎంత శక్తి వ్యయమౌతూందో మానవులకు తెలియడం లేదు

—జౌన్ పెన్సీ—

"కర్మఫలముల కాశపడక తమ తమ కులోచితములైన
కర్మములను చేయుట నరులకు ఒప్పును."

ఉంటాయి. ఈ జాతి పక్షులన్నిటికీ చేపలే ముఖ్య ఆహారం. అయినా అన్నీ సముద్రపు చేపలను తినవు. గల్స్ హెరన్స్, కార్ మోరాంట్స్, ఫ్రిగేట్ పక్షులలా పెలికాన్ పక్షులు తీరప్రదేశాలలో నివసిస్తాయి. ఇవి ముఖ్యంగా ఉష్ణప్రదేశాలకు చెందినవే.



పెలికాన్ పక్షిలో అపూర్వమైన వింత పాటి గొంతులో ఉండే సంచి. బ్రౌన్ పెలికాన్ పక్షికి 3½ గాలనులు పట్టే సంచి ఉంటుంది ఇవి ముఖ్యంగా నీటిలో మునిగి చేపలను పట్టుకోవడానికి ఉపయోగపడతాయి. ఇవి ఎగురుతూ నీటిలో మునిగి చేపను నీళ్ళతో సహా సంచిలో చేర్చుకుని వెంటనే పైకి వచ్చి ముక్కును సవరించుకుంటూ సంచిలో నుంచి నీళ్ళను ఒంపేస్తుంది. నీరు ఒంపేసిన వెంటనే ముక్కు పైకి ఎత్తి గొంతులో ఉన్న చేపలను అతి చాకచక్యంగా మింగేస్తుంది.

ఈ జాతికి చెందిన ఇతర పక్షులలాగే పెలికాన్ పక్షులు చాలా బలిష్టమైనవి, నీళ్ళలో బాగా ఈదగలవు. నీళ్ళలో మునిగి డైవ్ చేయగలవు కూడా. గాలి నీటి స్వాధీనంలో ఉండటమే చాలా అద్భుతమైన విషయం. పెలెకాన్ పక్షులు అతి సునాయాసంగా, అవలీలగా గాలిలో తేలిపోతూంటాయి. పెలికాన్ పక్షులు గుంపులు గుంపులుగా ఎగురుతూంటాయి. ఆకాశంలో పైకి పోయి డేగలు, రాబందులు లాగా రెక్కలు చాచుకుని వర్తులాకారంలో జారుతూ తిరుగుతాయి. కొన్ని పక్షులు గుంపులో నుంచి పైకి వచ్చి తమ తమ వర్తుల మార్గంలో కొంతసేపు ఎగురుతాయి. అకస్మాత్తుగా ఒక పక్షి ఆగి మొగ్గలు వేయడం ప్రారంభిస్తుంది. పల్టీలు కొడుతుంది. విలాసంగా ఎగురుతుంది.

పెలికాన్ పక్షుల కూతలు వినడానికి అంత శ్రావ్యంగా, ఇంపుగా ఉండవు. బొంగురుగా చాలా కర్కశంగా ఉంటాయి. పెలికాన్ పిల్లపక్షులు 'ఉక్-ఉక్-ఉక్' అని ఏడుస్తున్నట్లు అరుస్తాయి.

ఇవి సంఘజీవులు. చిన్న చిన్న కాలనీలు

## క్వైనైన్ అంటే ఏమిటి?

దక్షిణ అమెరికా పెరూలో సతత హరితారణ్యపు వృక్షం (evergreen forest tree) సింకోనా అనే చెట్టు బెరడు నుంచి తయారైన అతిచేదైన పదార్థం క్వైనైన్ (Quinine). ఇది జ్వరంతో బాధపడే వారికి దివ్యౌషధం. మలేరియా జ్వరానికి నివారణిగానూ, మలేరియా నిరోధకంగానూ చాలా అమోఘమైనది. మొట్టమొదట 1630 లో క్వైనైన్ పెరూలో జెస్యూట్ మిషనరీకి ఇచ్చి మలేరియా జ్వరాన్ని తగ్గించారు. 1639 సం. రంలో యూరపు అన్ని దేశాలలోనే గాక ఇండియా, వెస్టిండీస్, ఇండోనేషియా, ఆస్ట్రేలియా దేశాలలో ప్రవేశించి ఇది వాణిజ్య పంటగా వృద్ధిపొందింది.

"అతిథులను ఆదరించుటకంటే గృహస్థులకు ధర్మమొండు లేదు."

ఏర్పరచుకుంటాయి. వలచి, వలపించుకోడం సామాన్యంగా మగ పక్షులకు, ఆడపక్షులకు పరస్పరం సహజం. ఆడపక్షి, మగపక్షి రెండూ చేరి గూడు కడతాయి. సముద్రంలో దొరికే కలుపు, కర్ర, కొయ్య ముక్కలు మొదలైన వాటితో గూటిని నిర్మించుకుంటాయి.



కొర్‌మోరాంట్స్‌లాగే ఇవి కూడా రెండు లేక మూడు గ్రుడ్లు పెడతాయి. గాన్నెట్ పక్షుల వలె ఇవి చాలా సాధువుగా గుంపులు, గుంపులుగా ఉంటాయి. చిన్న పెలికాన్ పక్షులు గూటిలోనుంచి పడిపోయినా తమ పిల్లలను రక్షించుకోవాలనేదే తెలియని మూఢపక్షులు, వివేకం లేదు. సాధారణంగా మగపక్షులు, ఆడపక్షులు కూడా గ్రుడ్లను పొదుగుతాయి.

ఇతర సముద్రపు పక్షులలాగే పెలికాన్ పక్షులలో కూడా ఒక్కొక్క మగపక్షికి ఒక ఆడపక్షితోటే సంబంధముంటుంది. పరస్పరం మగపక్షి, ఆడపక్షి ప్రేమించుకుంటూ విలాసంగా ఉంటాయి. ఒకసారి సంపర్కం జరిగిన తరువాత - గ్రుడ్లు పెరిగి పిల్లలు వచ్చిన తరువాత కూడా వీటి ప్రేమకలాపాలు సాగుతూనే ఉంటాయి. గూడు కట్టడంలోగానీ, గ్రుడ్లను పొదగడంలో కానీ, చిన్నపక్షులను పెంచడంలోగానీ ఆడపక్షితో పాటు మగపక్షి కూడా సమంగా బాధ్యత వహిస్తుంది. జీవితాంతం వరకూ రెండూ ఎంతో అన్యోన్యంగా ఉంటాయి. సహవాస యోగ్యమైన సరసత. కలుపుగోలుతనం ఉన్నా పెలికాన్ పక్షులు తమ కుటుంబాన్ని వదలి పైకి వెడితే అవి చాలా స్వార్థపరమైన పక్షులు.

(16 వ పేజీ తరువాయి)

చెప్పాడు వెంటనే ఆ అద్భుతాన్ని పరీక్షించాలని కృష్ణణ్ణి చూపించమన్నాడు. అందరూ బయలుదేరి అడవులలోకి వెళ్ళారు. "అన్నా! కృష్ణా! మా గురువుగారు వచ్చారు నిన్ను చూడడానికి. ఎక్కడ ఉన్నావు? ఒక్కసారి రావా! అన్నా!" అని పిలిచాడు అంతా నిశ్శబ్దంగా ఉంది ఏం జవాబు లేదు. ఎన్ని సార్లు పిలిచినా ఏం లేదు. ఏం చేయాలో తెలియక ఆ బాలుడు ఏడుస్తూ "అన్నా! ఒక్కసారి రా! లేకపోతే నేను నిజం చెప్పడం లేదంటారు. రావా!" అన్నాడు వెంటనే దూరం నుంచి "నీ హృదయం నిష్కళంకం, నిర్మలం. అమాయకమైన నీ విశ్వాసంవల్లే నీకు కనిపిస్తాను. మీ మేష్టారికి నన్ను చూడాలంటే ఇంకా ఎన్నో జన్మలు గడవాలి. వారి మనస్సు పరిపక్వం కాలేదు" అని వినిపించింది

"మానవులకు పూర్వజన్మార్జితములైన
పుణ్య పాప ఫలంబులు గుడువకపోరాదు."

# ఏకాగ్రతతో ఉత్త

హెచ్. కె. లక్ష్మణరావు

యుద్ధ సమయంలో, వ్యాపార వ్యవహారాలం, ఇతరులతో వ్యవహరించవలసిన సమయాలలో, ఉద్యోగ ధర్మంలో, వ్యక్తిగత ఉద్యమాలలో శక్తిసామర్థ్యాలకు పునాది ఏకాగ్రత.




ఏకాగ్రత అనే శక్తి సాధారణంగా మన అందరిలోను నిబిడమై ఉన్నదే. కాని దీన్ని చాలా అరుదుగా పూర్తిగా అభివృద్ధి చేసుకుని వినియోగించుకుంటున్నాం.

శారీరకంగా దైహికశక్తి, మానసికశక్తి రెంటికీ సరసమైన పొందిక ఉంటేగాని దీన్ని సాధించలేం. సామర్థ్యవంతంగా పనులను కొనసాగించేవారు ఏ యే పనులు ఎప్పుడెప్పుడు చేయాలో నిమర్శించుకుని ప్రత్యేకించుకుంటారు. ఈ విధంగా ప్రత్యేకించుకున్న ఒక్కొక్క పనిని ఒకేసారి చేపట్టి ఏకాగ్రతతో. విజయవంతంగా సాధించి ఉత్పాదన పెంపొందించుకుంటారు. ఏకాగ్రతను అభ్యాసం చేసుకుంటే శ్రద్ధ, ఆసక్తి, అభినివేశం, పూనిక అభివృద్ధి పొందుతాయి. దీనివల్ల శక్తి సామర్థ్యాలు అమోఘంగా పెరుగుతాయి. సంఘానికీ, సమాజానికీ, దేశానికీ, స్వలాభానికి అమితంగా అనుకూల పడతాయి.

ఏకాగ్రత అంటే మడికట్టుకుని ఎక్కడో దేవుడిగదిలో మారుమూల ముక్కుపట్టుకుని జపం చేసుకోడం కాదు. సాధక. బాధకాలు తెలుసుకుని అవగాహన చేసుకోవాలి మనస్సులో కలతలు. తొందరలు ఉన్నంతసేపూ పరిసరాల వాస్తవికతను తెలుసుకోలేం. మన నిర్ణయాలు. అభిప్రాయాలు సంకుచిత దృష్టితో పక్షపాతంగా ఉంటాయి.

---

## ఫైసన్ గడియారం 1932 వ సం. లో డిజైను కావింపబడింది

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ డోములో ఉన్న పెద్ద 'ఫైసన్ గడియారం' (Fyson clock) కి ఆ కాలేజి ప్రిన్సిపాల్ పేరు పెట్టబడింది. దీనిని 1932 వ సం. లో అక్కడి ఫిజిక్స్ ప్రొఫెసర్ డా. హెచ్. పరమేశ్వరన్ డిజైను చేసారు.

---

"విజతత్త్వముయొక్క యదార్థప్రకృతిని కనుగొన్నప్పుడు
వ్యక్తమంతయు, అవ్యక్తమున కలసిపోయి అదృశ్యమగును."

ఎప్పుడూ ఒకసారి ఒకేపనిని పెట్టుకుని దానిని నిర్విఘ్నంగా కొనసాగించడానికి అభ్యాసం చేసుకోవాలి. అప్పుడు ఏకాగ్రత పెరుగుతుంది. మనం ఒకసారి ఒక పనినే చేయగలం. దానిని బాగా చేయగలుగుతాం కూడా. ఏకాగ్రతవల్ల పనులు వేగంగా సమకూరుతాయి. తక్కువ కాలం, తక్కువశక్తి వినియోగాలతో సరసంగా పనులను వేగంగా పూర్తి చేయగలుగుతాం.

ఏకాగ్రత వృద్ధి పొందాలంటే ఆత్మ నిగ్రహం ఉండాలి. అంటే శక్తి, విశ్వాసం, మనం చేపట్టిన పనిమీద పట్టుదల అభివృద్ధి చేసుకోవాలి. దీని వల్ల భావనాశక్తి అధికమవుతుంది. ఏకాగ్రతను సాధించుకున్నవారికి మానసిక ఉద్రేకభావాలు ఉండవు. శక్తిసామర్థ్యాలనూ, అనుకూలాలనూ పూర్తిగా వినియోగించుకుంటూ అనుసరించవలసిన మార్గాన్ని సఫలవంతంగా చేసుకోవడమే ఏకాగ్రత యొక్క ముఖ్య ఉద్దేశం.

ఏకాగ్రతను సాధించడానికి ముఖ్యంగా ఉత్సాహం, కృతనిశ్చయం, నిరంతర కృషి, ఎడతెరిపిలేని అభ్యాసం, అభిలాష ఉండాలి. గొప్ప గొప్ప వైజ్ఞానిక శాస్త్రవేత్తలు, తత్వజ్ఞులు, రచయితలు తమ కృత నిశ్చయంవల్ల, పట్టుదలవల్ల కీర్తిని సంపాదించగలిగారు

ఏకాగ్రతవల్ల యోచనాశక్తి అభివృద్ధి పొందుతుంది. విచక్షణతో, వివేకంతో నిర్ణయాలు తీసుకోగలుగుతాం సంశయ విచ్ఛేదం కలిగి ఒక నూతన ప్రపంచంలో నవచైత జీవించ గలుగుతాం. ఒక నూతన ఉత్సాహం, అభిలాష, తీక్షత పొందుతాం. ఏకాగ్రతలో మన ధ్యేయం తప్ప ఇతర విషయాలు మన కంటికి కనిపించవు.

ఏకాగ్రత మన మానసిక, దైహిక శక్తుల సమ్మేళనంతో ఏర్పరచుకోగలఅపూర్వ సాధక మార్గం. వాస్తవికమైన ఏకాగ్రతకు కుశాగ్ర బుద్ధి పెంపొందాలి. సాధారణంగా జరిగిన పొరపాటువల్ల, అపజయాల వల్ల మనసు బాధపడిపోయి నిష్ప్రయోజకం అయిపోతుంది. దీనివల్ల మనస్సులో ఋణ

## లోకం తీరు !




వాళ్ళని తొందర పెట్టవద్దు ముఖ్యమైన జాతీయ సమస్యకు నిర్ణయం తీసుకుంటున్నారు.

"నిజమైన యోగి విశుద్ధమనస్కుడై
లోకులొనర్చిన అవమానమును క్షమించును."

భావం పెరిగిపోతుంది. జరిగిపోయిన సంఘటనలనే ఆలోచించుకుంటారు. పగటి కలలు కంటాడు. రాబోయే దానిని గురించి వ్యర్థంగా ఆలోచించుకుంటారు. ఏకాగ్రతను సాధించడం వీణను శృతి చేయడం వంటిది. దీనివల్ల ఆత్మోత్సాహం. ఆసక్తి వృద్ధిపొందుతుంది. జీవితం సుఖమయమనిపిస్తుంది. సంఘంలో, సమాజంలో పరస్పర సహకార భావం కలుగుతుంది.

ఏకాగ్రతవల్ల ఆత్మసంయమనం. ఆసక్తి, అభిలాష వృద్ధి పొంది చేపట్టిన కార్యాలను అతి చాకచక్యంగా నైపుణ్యంతో అధిక పరిమాణంలో అతి విశిష్టంగా నిర్వర్తించగలుగుతాం. ఇతరులతో సరసంగా వ్యవహరించగలుగుతాం. మనలో ఉద్భవించే ఋణభావాలు నశిస్తాయి ధ్యేయాన్ని సూటిగా అనుసరించి అనుకూల వాతావరణం కల్పించుకుని సులభంగా లక్ష్యాలను సాధించగలుగుతాం.

ఒక ఉద్యమంలో జయాపజయాలు వ్యక్తిగత శక్తిసామర్థ్యాలమీద ఆధారపడి ఉండవు. వారి వారి ఏకాగ్రత, కార్యదీక్ష మీదే ఆధారపడి ఉంటాయి. రెండు ప్రత్యేక అవకాశాలలో మీరు మీ ఉద్యమాలను సాధించిన విధానం గమనించారా? మీరు పూర్తిగా కార్యాచరణలో నిమగ్నులై ఉన్నప్పుడు మీలో దాగి ఉన్న శక్తుల నన్నిటినీ వినియోగించుకుంటారు. అలా కాకుండా ఏదో విధంగా పైపైన శీఘ్రంగా కార్యం ముగించేసి వెడదామనుకుంటే ధ్యేయాన్ని పొందలేరు.

ఒకసారి అంతబాగా ఎలా చేయగలిగాం మరోసారి ఎందుకు చేయలేకపోయాం అని మనకే ఒక్కొక్కసారి ఆశ్చర్యం కలుగుతుంది. మన ఉత్సాహం, మనోనిశ్చయం దీనికి కారణం. మనం ఉత్సాహంగా ఉన్నప్పుడు మనలో శక్తులన్నీ ఉత్తమస్థాయిలో ఉంటాయి. ఏకాగ్రతవల్ల ఉద్యమ శక్తులు అధికమవుతాయి

మనలో దాగివుండే అంతఃశక్తులను వినియోగించుకుంటూ, ప్రవృద్ధి చేసుకుంటూ ఉండాలి. ఇది ఒక మాయ కాదు. ఇంద్రజాలం కాదు మన ప్రయత్నాలవల్ల, పట్టుదలవల్ల మాత్రమే ఇది సాధ్యమవుతుంది శారీరకంగా, మానసికంగా, ఔత్సాహికంగా అభ్యాసంమీదే ఇది సాధ్యం.

అందరికి ఇది సాధ్యంకాదు. ప్రతి వ్యక్తి తనకు తగినంత ఏకాగ్రతను పొందాలి. మీకు ఎంతవరకు తాహతు ఉందో తెలుసుకుని ప్రవర్తించాలి. అకుంఠిత కార్యదీక్షతో, ఏకాగ్రతతో ఉత్తమమైన ఫలితాలను పొందగలం.

## ప్రతీరోజు మానవుని గుండె 1,03,000 సార్లు కొట్టుకుంటుంది

ప్రతీరోజూ మానవుని గుండె 1,03,000 సార్లు కొట్టుకుంటుంది. శరీరంలో రక్తం 1.68.000 మైళ్ళు ప్రవహిస్తుంది. 23 000 సార్లు ఊపిరి తీసుకుంటారు. 438 ఘనపు అడుగుల గాలిని పీల్చుకుంటారు.

"దీపం దీపాన్ని వెలిగించినట్లు గురుశిష్య సంబంధంతో గురువుయొక్క మూర్తిత్వం శిష్యుని మూర్తిత్వాన్ని ప్రకాశింప జేస్తుంది."

(8 వ పేజీ తరువాయి)

ఉంటాయి. అన్ని అవసరాలకు సరిపోయే బహుముఖోపయోగకరమైన మత్తుమందులు లేవు. శస్త్రచికిత్సను బట్టి, రోగి నైజాన్ని బట్టి ఆ రోగికి అనువుగా ఉండే ఉత్తమమైన మత్తు మందును వైద్యులు స్వీకరిస్తారు. ఒకే మత్తు మందునుగానీ, రెండు మూడు మందులను కలిపిగాని ఉపయోగిస్తారు.

ఇంతవరకు వివరింపబడిన మందులు శరీరంలో నరాలమీద రసాయనిక చర్య కలిగి ఉంటాయి. మత్తును కలిగించే మరికొన్ని విధానాలు కూడా ఉన్నాయి. మంచుగడ్డ ముక్కలు పెట్టి ఉష్ణోగ్రత బాగా తగ్గించి శరీరంలో పత్యేక ప్రదేశం మొద్దుబారేటట్టు చేస్తారు. ఉష్ణోగ్రత బాగా తగ్గుతున్న కొద్దీ మెల్లిగా మొద్దుబారి తరువాత స్పర్శజ్ఞానం నశిస్తుంది.

దేహంలోపలి ప్రత్యేక అవయవాలను గానీ, ఒక్కొక్కప్పుడు పూర్తిగా శరీరాన్ని గానీ బాగా చల్లబరచి స్పర్శజ్ఞానం లేకుండా చేస్తారు. ఈ ప్రత్యేక విధానమే హైపో థెర్మియా. (హైపో - తక్కువ - థెర్మియా ఉష్ణోగ్రత) ఇది సాధారణంగా మెదడుకి, గుండెకి చేయవలసిన శస్త్రచికిత్సలకు ఉపయోగిస్తారు. దీనివల్ల శస్త్రచికిత్స చేయవలసిన ప్రదేశంలో ఉష్ణోగ్రత తగ్గిపోయి (78° ఫారన్‌హీటు) రక్తప్రవాహం ఉండదు. మొద్దుబారిపోతుంది. మత్తుమందు వల్ల శస్త్ర చికిత్స పొందే రోగికి బాధ ఉండదు. ఈ నాడు ప్రాణాలను రక్షించడానికి శస్త్ర చికిత్సలకు ఇదివరకు కనీ, విని, ఎరుగని మత్తు మందులు ఎన్నో రకాలు ఉన్నాయి.

# అన్నమాచార్య సంకీర్తనలు




క్రీ.శ. 1424-1503 మధ్యనెలసిన గొప్ప వైష్ణవభక్తుడు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి పరమ భక్తుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు తెలుగులో పదకవిత్వము ధారాళముగా చెప్పిన ప్రథమ వాగ్గేయ కారకుడు. ఇతడు కడపలో తాళ్ళపాక గ్రామంలో జన్మించాడు. రాగి రేకుల మీద తిరుపతి వేంకటేశ్వరులపై రచించిన వీరి పాటలు నేటికి తిరుమల తిరుపతి దేవస్థానం వారివద్ద కలవు. ఇతడు వ్రాసిన 32,000 పదములలో లభించిన 1,200 మాత్రమే రక్షింపబడ్డాయి. ఈ పదములను సంకీర్తనములంటారు ఇవి—

"శ్రుతులై, శాస్త్రములై, పురాణకథలై,
సుజ్ఞాన సారంబులై,
యతిలోకాగమ వీధులై, వివిధ మంత్రా
ర్థంబులై, నీతులై,
కృతులై, వేంకటశైల వల్లభ రతిక్రీడా
రహస్యంబులై,
నుతులై, తాళపాక యన్నమయ
వచోనూత్న క్రియల్ చెన్నగున్".

"మూర్ఖుల చిత్తవృత్తి మాన్ప నెవ్వరితరము కాదు"

# మొట్టమొదట అచ్చైన గ్రంథం

భారత దేశంలో అచ్చు వేయడం (ప్రింటింగు) పోర్చుగల్, నెదర్‌లాండ్స్ (యూరపు) మిషనరీలు ప్రారంభించారు. పడమటి తీరాన గోవా, కొచ్చిన్, పుదుకోట్టయిల్, అంబాలాకాడ్, తమిళనాడులోని తరంగంబాడిలోను, కలకత్తాలోని ఫోర్టు విలియంలోను, పశ్చిమ బెంగాల్‌లోని సిరాంపూరులోను మొట్టమొదట ప్రింటింగ్ ప్రెస్‌లు నెలకొల్పబడ్డాయి.



భారతదేశపు మొట్టమొదటి అచ్చైన పుస్తకం — 1557 వ సం.లో సెంట్ ఫ్రాన్సిస్ జేవియర్స్ వ్రాసిన 'క్రైస్తవ ధర్మ కాటెచిస్మ్', (Catechism of Christian Doctrine). జీసస్ సొసైటీకి సంబంధించిన స్పానిష్ దేశస్థుడైన జోహూగోన్ సాల్వ్స్ అనే క్రైస్తవ సోదరుడు జేవియర్స్ గ్రంథం మళయాళ అనువాదాన్ని ప్రచురించాడు.

1670వ సం.లో అంబాల్‌కాడ్‌లో తమిళ-పోర్చుగీసు శబ్దకోశం అచ్చైంది. మలబారులోని ఇగ్నేషియస్ ఎయిచ్చామొణికొయ్యమీద చెక్కిన తమిళ టైపులను ఉపయోగించి దీనిని అచ్చువేసాడు.

యూరపులోని డెన్మార్క్ మిషనరీలు అనేక తమిళ గ్రంథాలను అచ్చువేశారు. 1712వ సం.లో తమిళంలో బైబిలు అచ్చువేయటానికి తరంగంబాడిలో ఒక ప్రెస్‌ను నెలకొల్పారు.

ఫ్రెడరిక్ స్క్వాన్ట్జ (Frederick schwantz) అనే డెన్మార్కు మిషనరీ తంజావూరు రాజైన శరభోజీ బోన్‌స్లే చేత (1799-1813 తమిళనాడులో ప్రెస్ స్థాపింపజేసి సంస్కృతం, మరాటీ భాషలలో గ్రంథాలు అచ్చువేయించాడు. నేటికీ సరస్వతీ మహల్ లైబ్రరీలో 1809 లోను, 1812 లోను అచ్చైన గ్రంథాలు రెండు భద్రపరచబడ్డాయి.

మద్రాసులో 1761 వ సం. లో మొదట ప్రెస్ స్థాపింపబడింది. మూడవ కర్ణాటక యుద్ధానంతరం ఫ్రెంచివారు వదలి వెళ్ళిన ప్రెస్‌ను ఆంగ్లేయులు వేపేరిలో (పోలీస్ స్టేషన్ వెనుక) నెలకొల్పారు. ఇదే తరువాత డయోసెసన్ (Diocesan) ప్రెస్‌గా ప్రసిద్ధి

(మిగతా 77వ పేజీలో)

"అప్రయత్నంగా విజయం పొందిన వారికంటే
ప్రయత్నం చేసి విఫలులైనవారు ఎంతో మేలు"

# పోటీలు

(జనవరి 1986)

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు, రూ. 7 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: జనవరి 20, 1986. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9. దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

-సంపాదకుడు.

## వ్యాసం

"సామాన్యుని జీవితం-కొన్నిసమస్యలు" అనే అంశంమీద 300 మాటలకు మించకుండా వ్యాయం వ్రాసి పంపండి.

## క్విజ్

1. నెల్సన్ మాండెలా ఎవరు?, 2. యునైటెడ్ నేషన్స్ ఏ రోజున 40 వ వార్షికోత్సవాన్ని జరుపుకుంది?, 3. ఇకాలజీ (ecology) అంటే ఏమిటి? 4. భారత దేశంలో రైల్వే డీసెల్ఇంజనులు ఎక్కడ తయారు చేస్తారు?, 5 "గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ"అనే గ్రంథం రచించినదెవరు?, 6. మానవ శరీరంలో ఏ గ్రంథి ఇన్సులిన్‌ను ఉత్పాదిస్తుంది. 7. భారతదేశపు ప్రధాన న్యాయమూర్తి రిటైరు కావలసిన వయస్సు (ఎ) 55, (బి) 62, (సి) 65, 8. 'ఆపరేషన్ బ్లూ స్టార్' అంటే ఏమిటి?

## పజిల్

ఆధారాలు-అడ్డం: 1. పరమాత్మతో

తనకు గల దగ్గర సంబంధమును చూపుకొని "రామా! నిన్నెంతని ప్రార్థించను" అని త్యాగరాజు వేడుకుంటున్నాడు, 6. దంతాలు ఊడిపోయిన బోసినోరు. దృష్టి ఆనని కళ్ళు, పటుత్వం పోయి వణుకుతూన్న శరీరం వీరి కొన్ని లక్షణాలు, 7. ఉపాధ్యాయుడు పట ములో వివిధ భాగాలు వివరంగా ఈ క్రియతో బోధపరుస్తాడు. 8. బియ్యము, పప్పు లు మొదలైనవి వండుటకు ముందు శుభ్రము చేయగా వచ్చిన నీరు, 10. భూమిమీద ప్రయత్నంచేసి కుందేటి కొమ్మును తీసుకు రావచ్చు, దీంట్లో నీళ్ళు త్రాగవచ్చు, కాని మూర్ఖుని మనస్సు మార్చలేము అన్నాడు ఒక కవి, 11. చినుకులు పడుట, కాయలు, ఎండు ఆకులు రాలుట, నిప్పు మండుట మొదలైన వానియందు ధ్వని అనుకరణమును సూచించే పదంలో మొదటి రెండు అక్షరాలు తారు మారైనవి, 12. నిద్రలో వచ్చేది— తారు మారైతే, 14. మానవుని చిత్తము ను అప్రయత్నంగా, సధర్మంగా తనవంకకు మరల్చుకొనునది, 16. వివాహం ముందు సాధారణంగా ఆడపెళ్ళివారు మగపెళ్ళివారిని దింపే ప్రదేశం, 17. చంద్రుడు, పదివేలు, చంద్రుడిలో 16 వ భాగం అని అర్థాలు ఇచ్చే మూడు మాటలు.

నిలువు: 1. శ్రీరాముని యందు నిత్య రూపములై భక్తులను ఆకర్షించే ప్రేమ యొక్క రూపాంతరము, సౌందర్యము ఎవరి వల్ల వర్ణింపదగును? అని త్యాగరాజు ఆశ్చ ర్యంతో చెప్పిన మాట, 2. ధనుర్మాసంలో బాలికలు ఇళ్ళముందు కసవు ఊడ్చి కల్లాపు




జల్లి గొబ్బితట్టడం వంటి సంతోషకరమగు కార్యము, 3. అతి దీర్ఘ విషయానికి ఉప మానంగా వాడే చేంతాడు ఆంధ్రదేశంలో ఈ ఊరికి చెందినది. 4. రాలుచు అనే పదా నికి దీర్ఘమాదేశమైనప్పుడు, 5. ప్రేమను, చూపించుటకు, తగిన, సమయము అనే నాలుగు మాటలు చేరి, 8. లోకబాంధవుడైన సూర్యుడు చూడలేని ప్రదేశాలలో కూడా వీరు చూడగలరు, 9. ఒకసారి నోట్లో పోసు కుని మ్రింగ గలది, 13. సీతమ్మతల్లి ముద్దు బిడ్డల పేరుతో వచ్చిన సినిమా, 15. జ్యోతిష

## నక్షత్రాలన్నీ అతివేగంగా తిరుగుతాయి

ఒకప్పుడు ధృవనక్షత్రం కదలకుండా స్థిరంగా ఉంటుందనుకునేవారు. కాని ఇప్పుడు ధృవనక్షత్రం, ఇతర నక్షత్రాలన్నీ బ్రహ్మాండమైన వేగంతో సంచరిస్తున్నాయని ఖగోళ శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు.

---

"ద్వైతస్థితిలో ఎప్పుడూ సంశయాలే, అన్నీ సమస్యలే"

శాస్త్రం ప్రకారం రాశి చక్రంలో ఏకాదశ స్థానంలో ఈ గ్రహం మంచి ఫలితాలను ఇస్తుందంటారు, 16. నమస్కారం.

## తెలివికి పరీక్ష

1. కాగితం పెన్సిలు ఉపయోగించకుండా 1 మొదలు 200 దాకా వరుస సంఖ్యల మొత్తమెంత?

2. ప్రాజ్ఞుడు జరిగిపోయిన విషయాలను పరామర్శించి మేలు పొందును, అను దానికి లోకమందును. శాస్త్రమందును ప్రసిద్ధమగు దృష్టాంత విశేషమేమిటి?

3. ఒకరు ఏదో జరుగుతుంది, ఏదో పోతుంది అని చెప్పినప్పుడు అలా ఏదీ జరగదని మనకు అపనమ్మకం కలిగినప్పుడు సర్వసాధారణంగా వాడే తెలుగు పలుకుబడి ఏమిటి?

4. ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది? 50, 44, 38, 32, 26——.

5 తన పితంతు సోదరిని. వివాహం చేసుకోడానికి సాధ్యమా?

6. తెలుగులో సమగ్ర ఆంధ్ర సాహిత్యం 16 సంపుటాలుగా రచించిన 'ఆరుద్ర' అసలు పేరేమిటి?

7. తెలుగులో మొదటి పిల్లల చిత్రం ఏది? ఎవరు తీశారు? ఎప్పుడు?

8. అతి దీర్ఘ విషయమునకు ఉపమానంగా వాడే తెలుగు జాతీయం.

విజడమ్
పోటీల కూపను
జనవరి 1986

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి.

1. రాష్ట్రము: దేశము (ఎ), గాడిద (బి), ఉపద్రవము (సి), ఔషధ విశేషం (డి).

2. శారద: సరస్వతి (ఎ), సంవత్సరం (బి). క్రొత్తది (సి), వియంత(డి).

3 ఖామందు: ఒకరకం మందు(ఎ), యజమాని (బి), తురుష్క మతగురువు(సి), స్వంతగాడు (డి).

4. అనువు: ఆజ్ఞాపించుట (ఎ), ఉపాయం (బి), అవకాశం (సి), అనతి(డి).

5. మనువు: రక్షణము (ఎ), జీవనము (బి). నర్తనము (సి), మగడు (డి).

6. ఎసవెట్టు: ప్రేరేపించు (ఎ),

(74 వ పేజీ తరువాయి)

పొందింది. ఇక్కడే మొట్టమొదట 1779 వ సం.లో తమిళ్ - ఇంగ్లీషు నిఘంటువు అచ్చైంది. మద్రాసులో మొదటి వార్తాపత్రిక "ది మెడ్రాస్ కురియర్." బ్రిటిష్ మ్యూజియంలో ఈ పత్రిక జనవరి 25, 1788 నాటి సంచికను భద్రపరచి ఉంచారు.

## విస్డమ్ పోటీల జవాబులు జనవరి 1986

వంటకై నీరుకాచుట (బి), పురికొలుపు (సి) విజృంభించు (డి).

7. ఏటికోళ్ళు: నమస్కారములు (ఎ). రక్షణ (బి), బాణపు దెబ్బలు (సి), వంకర కాళ్ళు (డి).

8 పాలు: తెల్లనగు (ఎ), భాగము (బి), క్షీరము (సి), వశము (డి).

## ముఖచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 ల ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

'ప్రకృతి ఆగ్రహిస్తే'' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయపోటీ




8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలకూ ప చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## సూర్యగ్రహణ కాలం

సూర్యగ్రహణం పట్టే అత్యధిక కాలం 7 నిమిషాల 31 సెకండ్లుపాటే. దీనిని మించి ఉండదు.

# పోటీలు (ఫలితాలు)

(నవంబరు - 1985)

**వ్యాసం - విజేతలు**: మొదటి బహుమతి: ఎమ్. మధుసూదనరావు, వసుంధర, శ్రీకాకుళం; రెండవ బహుమతి: ఇందుకూరి హేమనళిని, హైదరాబాదు; మూడవ బహుమతి. శ్రీమతి గుడి సుదర్శన, ఉలవపాడు.

**క్విజ్—జవాబులు**: 1 (సి) యు కె. 2. (ఎ) బట్టల పరిశ్రమ, 3. (బి) 1974, 4. (బి) క్రికెట్, 5. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, 6 (సి) పోర్చుగీసు, 7. (బి) నెయిల్ ఆర్మ్‌స్ట్రాంగ్, 8. (సి) డిస్కవరీ ఆఫ్ ఇండియా

**విజేతలు**—మొదటి బహుమతి: పాలేపు రామచంద్రమూర్తి, హన్మకొండ, (వరంగల్ జిల్లా): రెండవ బహుమతి: జి. శ్రీనివాస్, బెండపూడి, (తూ గో. జిల్లా): మూడవ బహుమతి: బి.ఎస్.వి.బి. రాజా, జేకేపూర్, (ఒరిస్సా).

**పజిల్ - జవాబులు - అడ్డం**: 1. తెలుగు, 3. గుసగుసలు, 6. జగన, 7. గులాము, 8. పనితనము, 9 వేరుపురుగు, 10. ఎసరు. 11. ఖ్యాపనము, 12. ముసలము, 14. ముక్తావళి, 15. దుమువులు.

**నిలువు**: 1. తెలుగు గంగ పథకము, 2. గుణములు వేరు, 3. గుసపపు పుణుస, 4. గుణితము గుణ్యము, 5. లుప్తము కాదు ముతలిలు, 12. మురళి, 13. లవుడు.

**విజేతలు**—రెండవ బహుమతి: ఎస్. ఎల్. శ్రీరామచంద్రమూర్తి, కారంచపూడి, (గుంటూరు జిల్లా): మూడవ బహుమతి: శ్రిష్టి లక్ష్మీసీతారామాంజనేయశాస్త్రి. జిల్లెళ్ళ

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద టీ. వీ. స్క్రీను



25 మీటర్ల ఎత్తు, 40 మీటర్ల వెడల్పు గల టీ. వీ. స్క్రీను ప్రపంచంలోనే మిక్కిలి పెద్దది. దీని 1,50,000 ల్యూమినస్ ట్రినిలైట్ ఎలిమెంట్లు ఎరుపు, ఆకుపచ్చ, నీలం మౌళిక వర్ణాలను ప్రతిఫలిస్తాయి. ప్రతి ట్రినిలైట్ ఎలిమెంట్ నిరాటంకంగా ఒకే రకంగా కాంతులను ప్రతిఫలిస్తుంది.

"లోకము భయంకరమైన సంక్షోభాన్ని కలిగించే పెనుతుఫానులకు పుట్టిల్లు"

మూడి పోస్టు (గుంటూరు జిల్లా)

**తెలివికి పరీక్ష: జవాబులు:** 1. 10, 2. అనాది మధ్యాంతము, 3. టెలిస్కోపు, 4. శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము త్రిలింగ క్షేత్రాలు, వీటి మధ్యప్రదేశము త్రిలింగ క్షేత్రము ఆంధ్రదేశము. అక్కడి భాష "త్రిలింగభాష" రాను రాను తెలుగుగా మారింది. 5. 56. అఆఇఈఉఊఋౠఎఏఐఒఓఔ అంఅః కఖగఘఙచఛజఝఞటఠడఢణతథదధనపఫబభమయరలవశషసహళ. 6. రామదండు, 7. శ్రీనాథుడు— పల్నాటిసీమ. 8. స్టాంపు.

**విజేతలు** — రెండవ బహుమతి: వి. జగదీశ్, వరంగల్; మూడవ బహుమతి: ఎన్. సదానందం, పెద్దాపురం, (కరీంనగర్ జిల్లా).

**మాటల మహిమ - జవాబులు:** 1. వాద్యం (బి), కంబళి (సి), దర్భ (డి), 2. అందము (ఎ), విధము (బి), 3. స్నేహం (సి), సహాయం (డి), 4. జీవం (ఎ), సంచరించు (సి), 5. పరధ్యానం (ఎ), పరవశత్వము (బి), నిశ్చేష్టత (సి), 6. ఒంటె (బి), 7. విరక్షరకుక్షి (ఎ), అసమర్థుడు (బి), 8. కలహమునకై కత్తి ఎత్తు (ఎ).

**విజేతలు**— మొదటి బహుమతి: బి. శైలేశ్‌కుమార్, వరంగల్; రెండవ బహుమతి: వి. జగదీశ్, వరంగల్; మూడవ బహుమతి: పి. రజనీప్రసాద్, ఒంగోలు (ప్రకాశం జిల్లా).

**ముఖచిత్ర వ్యాఖ్య**— మొదటి బహుమతి: శ్రిష్టి లక్ష్మీసీతారామాంజనేయ శాస్త్రి, జిల్లెళ్లమూడి (గుంటూరు జిల్లా), రెండవ బహుమతి: ఎస్ దయాకర్, హనుమకొండ. (వరంగల్ జిల్లా); మూడవ బహుమతి: ఆర్. శ్రీనివాస్, శ్రీ కాళహస్తి. (చిత్తూరు జిల్లా).

**పాఠకుల అభిప్రాయాలు**— మొదటి బహుమతి: బి.ఎస్.వి.బి. రాజా, జేకేపూర్, (ఒరిస్సా); రెండవ బహుమతి: జి శ్యామసుందరమూర్తి, ఖమ్మం; మూడవ బహుమతి గుడ్ల సంజీవరావు, కల్యాణ పింగుపురం, (ఒరిస్సా).

**మీరైతే...?** — మొదటి బహుమతి: గుడ్ల సంజీవరావు, కల్యాణ పింగుపురం, (ఒరిస్సా); రెండవ బహుమతి: ఎస్. దయాకర్, హనుమకొండ (వరంగల్ జిల్లా); మూడవ బహుమతి: బి.ఎస్.వి.బి. రాజా, జేకేపూర్ పోస్టు, (ఒరిస్సా).

**భావపరిచయ పోటీ**— మొదటి బహుమతి: ఏ. ఉమారాణి, పుల్లూరు, (మెదక్ జిల్లా); రెండవ బహుమతి: శ్రీమతి పొడుగు సర్వలక్ష్మి, విశాఖపట్టణం; మూడవ బహుమతి: ఎన్. సదానందం, పెద్దాపురం, (కరీంనగర్ జిల్లా).

---

## బంగారు నాణాలతో తయారైన ఫిరంగి

టర్కీ— పశ్చిమ ఆసియాకి చెందిన ఇస్తాంబుల్‌లోని 'బంగారు ఫిరంగి', సుల్తాను సొలిమాన్‌కి 1553 సం. లో రాజ్యాలను జయించి దోచుకువచ్చిన 660 టన్నుల బంగారు నాణాలతో తయారు చేయబడింది.

"అసంబద్ధమైన దానికి, అప్రాముఖ్యమైన దానికి లయ ఒక వాస్తవికతను ప్రసాదిస్తుంది"